# సంపాదకీయము

సర్వజనసామరస్యమునకు తోడ్పడు ప్రాచ్యపాశ్చాత్య దేశముల యుత్తమజ్ఞానము ఆంధ్రులలో వ్యాప్తముచేయుట కుద్దేశింపబడిన ప్రాక్ప్రతీచీగ్రంథమాలయందు ప్రథమగ్రంథముగ శ్రీ ఎమ్. వి. ఎన్. సుబ్బారావు ఎమ్. ఏ గారు రచించిన యీ గ్రంథమును ప్రచురించుట కెంతయు సంతసిల్లుచున్నాము. సుబ్బారావుగారు ఆంగ్ల భాషాకోవిదులు. పాశ్చాత్యగ్రంథముల సారమును గ్రోలినవారగుటచే, వారీగ్రంథము వ్రాయుట కర్హులని వేరుగ జెప్పనక్కరలేదు. వెనుక మా కోరిక ననుసరించి ధర్మసాధనికి ఇందలి వ్యాసములు వ్రాసి యిచ్చుటయె గాక, ప్రస్తుతము అవి యిట్లీ గ్రంథరూపమున ప్రకటించుట కనుజ్ఞ నొసంగినందులకు వారికి మిగుల కృతజ్ఞులము.

పాశ్చాత్యదేశములందు పందొమ్మిదవ శతాబ్దమున నూతనభావతరంగము లెట్లు బయలువెడలి విస్తరించెనో యీ గ్రంథమునందు విస్పష్టముగ సులభశైలిలో వివరింపబడెను.

ఆత్మగౌరవము, వ్యక్తిస్వాతంత్ర్యము, జీవితనిత్య వికాసము ప్రతిపురుషుడును ప్రతిస్త్రీయును లక్ష్యములుగ

గ్రహించి, సర్వమానవసమత్వము ప్రపంచమున వెలయు టకు, సేవారూపమగు ఈశ్వరారాధన సలుపవలయు నను మహోన్నతాదర్శమును ఈ గ్రంథము పాఠకుల దృష్టి పథమున నిలుపును.

ఏ మహనీయుల ద్వారమున ఆ భావపరంపర వ్యక్త మయ్యెనో వారి చరిత్రములు మార్గదర్శకములు. వారి పవిత్ర జీవితములు సయితము ఈ గ్రంథమునందు సంక్షిప్తముగ పొందు పరుపబడెను. తద్గ్రంథపఠనము ధర్మ విచారణను పురిగొల్పి నూత్నజీవితాకాంక్షను వర్ధిల్ల జేయును; కాన ఆంధ్రులయందు అది విరివిగ జరుగ వలయు నని యభిలషించుచున్నాము.

ప్రాక్ ప్రతీచీ గ్రంథమాల
రాజమహేంద్రవరము

కామరాజు హనుమంతరావు
సంపాదకుడు

ప్రాక్ప్రతీచీగ్రంథమాల : ౧

# పాశ్చాత్యభావప్రపంచము

ఎమ్. వి. ఎన్. సుబ్బారావుగారు ఎమ్. ఏ.



ప్రాక్ప్రతీచీగ్రంథాలయము
రాజమహేంద్రవరము

THE ANDHRA BOOK HOUSE.
SULTAN BAZAR, HYDERABAD-DN.

# పీఠిక

ఏకత్వము సత్యము; భిన్నత్వము సుందరము. ఏకత్వము తత్త్వమునకు మూలసూత్రము; భిన్నత్వము జీవితమునకు ముఖ్యాధారము. ఈ రెంటియొక్క సమన్వయమునందే విజ్ఞానము పరిపక్వ మగుచున్నది; వేదాంతము సాఫల్యత నొందుచున్నది; చరిత్రకు సామరస్యము ఏర్పడుచున్నది.

తూరుపు వేరు; పడమర వేరు. వాని కాంతులు వేరు; వాని రుచులు వేరు; వాని వికాసములు వేరు. ప్రాచ్యుల ఆదర్శములు వేరు; పాశ్చాత్యుల ఆశయములు భిన్నములు. జీవనవిధానములందు, కర్మకాండలయందు, నైతికనియమములందు, రాజ్యాంగతంత్రములందు, సాంఘికాచారములందు ప్రాచ్యులకును పాశ్చాత్యులకును కడుంగడు భేదము కలదు.

కాని తరిచి చూచిన ఈ భిన్నత్వమునకు అతీతమైన ఒక ఐక్యత కనబడును. ప్రాచ్యులును పాశ్చాత్యులును ఒకే మనుష్యజాతికి చెందిన వారు. సుఖదుఃఖములు, అనురాగాది భావవిశేషములు వారికి సామాన్యములు. చిత్తవృత్తి, మానసికవికాసము, ఆధ్యాత్మికోన్మేషము వారి ఏకత్వమును ప్రకటించుచున్నవి.

అనేకత్వమునందలి యేకత్వతత్త్వమును, ఏకత్వము నందలి భిన్నత్వసౌందర్యమును దర్శనీయములు.

మరియొక విషయము. గిర్రున తిరుగుచున్న అదృష్ట చక్రము పాశ్చాత్యదేశములను ఇప్పుడు పైకి తీసికొని వచ్చినది. ప్రస్తుతము ప్రపంచముయొక్క దృష్టిని ఆక ర్షించినది పాశ్చాత్యవిజ్ఞానము. కావున పాశ్చాత్య కవీంద్రుల, తత్త్వజ్ఞుల, రాజనీతివేత్తల పరిచితి అపేక్ష ణీయము.

పందొమ్మిదవ శతాబ్దపు పాశ్చాత్యభావప్రతినిధు లన దగు మహాపురుషుల కొందరను గూర్చి యథాశక్తిని ఈ చిన్న పొత్తమునందు ప్రశంసించితి. పాశ్చాత్యభావప్రపం చము అపార మయినది ; అందలి మహాపురుషుల సంఖ్య అనల్పము; వారి భావబాహుళ్యము అపరిమిత మయినది. స్థాలీపులాకన్యాయముగ విషయమును గురించి ముచ్చ టించితి.

# తొలిపలుకు

ఇందలి వ్యాసములు 1916 వ సంవత్సరమున 'ధర్మ సాధని' పత్రికయందు ప్రచురణమునకై అప్పటి పత్రికా సంపాదకులును నా మిత్రులు నగు శ్రీయుత కామ రాజు హనుమంతరావు గారి ప్రోత్సాహముచే వ్రాసితి. ఇప్పు డివి గ్రంథరూపము దాల్చుటకును వారి ప్రోత్సాహమే కారణము.

భాషావిషయక సవరణలు కొన్ని సూచించినందులకు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారికిని మహారాజశ్రీ పింగళి లక్ష్మీకాంతము ఎమ్. ఏ. గారికిని నే నత్యంత కృతజ్ఞుడను.

మతుకుమల్లి సుబ్బారావు

"Much have I travell'd in the realms of gold,
And many goodly states and kingdoms seen."

*"God's is the West,*
*God's is the East,*
*And Northern and Southern lands*
*Rest in the peace of His hands."*

# విషయములు



కార్లయిలు

# కార్లయిలు

"Thomas Carlyle is one of the great original influences in the moral life of his century."

W. E. SIMONDS.

పందొమ్మిదవ శతాబ్దమున పాశ్చాత్యభావప్రపంచమును కదల్చివేసిన మహాజ్ఞాని కార్లయిలు. ఈత డొక సామాన్యకుటుంబమున జనించి తన యసమానప్రజ్ఞచేత సంఘమునం దొక గౌరవస్థానము నాక్రమించుకొనెను. యూనివర్సిటీయందు డిగ్రీని బడసి పేరు పొందక పోయినను, ఆ కాలమందలి జ్ఞానులకెల్ల నాయకుడయి ఎడింబరో యూనివర్సిటీకి లార్డురెక్టరు (Lord Rector) గా నెన్నుకొనబడెను. ఇతడు మతబోధకుడై క్రైస్తవమతమును బోధించుచుండ వినవలెనని ఈతని తల్లిదండ్రులువ్విళ్లూరిరి. కాని కార్లయిలు క్రైస్తవమతబోధకుడగుటకు సమ్మతింపకపోయెను. అయిన నొక క్రైస్తవులకే కాక మానవులందరికిని మతబోధకుడై ధర్మమును ధైర్యముతోను విశ్వాసముతోను ఉత్సాహముతోను బోధించు మహాభాగ్య మతనికి లభించెను. ఇప్పుడు సామాన్యముగ కార్లయిలు పందొమ్మిదవ శతాబ్దపు ప్రవక్తగా కీర్తింపబడుచున్నాడు.

తన జీవితకాల మంతయు అజీర్ణవ్యాధిచే బాధపడు చుండియు, ఎన్నడును దారిద్ర్యమునకు విస్తారము దూర మున నుండక పోయినను, ఇంక నెక్కువ చిక్కులకు లోనయిన వాడయ్యును, ఈతడు తన విధియే ఎప్పుడును లక్ష్యమునం దుంచుకొన్నవాడై అనేక గ్రంథముల వ్రాసి బహుజనులు వానిని పెడచెవిని పెట్టి తృణీకరించినను గట్టి పట్టుదల కలవాడై విసుగు చెందక తన సందేశమును స్పష్టముగాను నిర్భయముగాను వెల్లడించెను. ఇతని పట్టు దల తెలియజేయుట కొక చిన్న యంశమును జెప్పెదను. ఎంతయో ప్రయాసపడి, ఎన్ని గ్రంథములో పరిశీలించి, ఎన్ని రాత్రులో మేల్కొని, ఎన్ని నెలలో తన ప్రియు రాలి సహవాసము గూడ వీడి "ఫ్రెంచి విప్లవము" అను గ్రంథమును వ్రాసి పూర్తిచేసి అచ్చొత్తించుటకు బూ ర్వము దానిని దనమిత్రుడగు మిల్లుచేతి కిచ్చెను. మిసెసు టెయిలరు అను నామె ఆ గ్రంథమును మిల్లుదగ్గరనుండి తీసికొని తాను చదువుకొను బల్లమీద పెట్టెను. అది యెటులో బల్లమీదినుండి క్రిందపడెను. మరునాటి యుదయమున టెయిలరు దొరసానిగారి దాసి పొయి రాజజేయుట కా చిత్తుపుస్తకము నుపయోగించెను. ఆహా! కార్లయిలు పడిన శ్రమ యంతయు బూడిదలో

బోసిన పన్నీరువలె నయ్యెను గదా! పాపము, మిల్లు యొక్క వ్యసన మింతంత గాదు! జరిగిన విషాదకథ చెప్పు టకు మిల్లు కార్లయిలువద్దకు వచ్చెను. అత డాకథ విని ఏవో మంచి మాటలు చెప్పి మిల్లును పంపివేసి తన భార్యను జూచి "పాపము, మిల్లుయొక్క వ్యసనము మిక్కుటముగా నున్నది. మనకు నిజముగా నిది యెంత గొప్ప నష్టమో యతనికి దెలియ కుండగ దాచవలెను." అని చెప్పెను. తాను వ్రాసిన గ్రంథముతో తృప్తి జెం దక యంతకంటె ఉత్కృష్టతర గ్రంథమును తనచే వ్రాయిం చవలె నను నుద్దేశముతో ఈశ్వరు డీవిధముగ జేసె నని కార్లయిలు భావించి ఆ గ్రంథమును తిరిగి వ్రాయుటకు ప్రారంభించి యతిశ్రమతో గొంత కాలమునకు పూర్తి చేసెను. ఈ విషయములో కార్లయిలు చూపిన పట్టు దల, ఓర్పు, విశ్వాసము, వీరభావము, ఆయన మహా పురుషులలో నొక్క డని చెప్పక చెప్పుచున్నవి.

## 2

ఆయన యనేక గ్రంథముల వ్రాసెను; కాని "సార్టర్ రిజార్టసు" అనునది అన్నిటిలోను ముఖ్యమయిన దని

చెప్పవచ్చును. మొత్తముమీద ఆయన యుత్కృష్టభావము లన్నియు సంక్షిప్తముగనో విపులముగనో ఈగ్రంథమునందు గాన నగును. ఇది యొక యద్భుతమును విపరీతము నగు గ్రంథము. హృదయమునం దుండి ప్రజ్వరిల్లుచు వెలువడిన భావముల నుద్రేకపూరితమై ప్రజ్వరిల్లు శైలిలో నత్యద్భుతముగ కార్లయిలు వ్యక్తపరచెను. భావములు స్వతంత్రములు; శైలియు స్వతంత్రము. శైలి గ్రంథకర్తయొక్క ఆత్మప్రకాశమను సత్యమున కీగ్రంథము సాక్ష్య మిచ్చుచున్నది. కేవలము భావనారూప మయి నామరూపములు లేని అభూతమగు యూనివర్సిటీలో ప్రత్యేకము ఏ శాస్త్రమును గాక సాధారణ వస్తుజాలమునుగూర్చి బోధించు ప్రొఫెసరు టాయిఫెల్ స్ట్రోక్కు అను నాతడు దుస్తుల తత్త్వమును గురించి ఈ గ్రంథమునం దుపన్యసించును. ఇందు హాస్యరసము కల దని ఇక వేరుగ చెప్పవలయునా? కాని అది గభీరమును, దుర్గ్రాహ్యమును, విపరీతము నగు హాస్యరసము. ఈపుస్తకము ప్రచురించుటకు ఏడు సంవత్సరములవరకు నెవ్వరు నంగీకరింప లేదనిన యపుడు దీనివైపరీత్యమును ఉపజ్ఞయు స్వతంత్రరూపమును పాఠకులే యూహించుకొన వచ్చును.

అయినను పందొమ్మిదవ శతాబ్దమునందు ప్రచురింపబడిన గ్రంథరాజములలో నిది యొకటి. మొదట బోధపడకపోయినను క్రమక్రమముగా దీనియొక్క ఉత్కృష్టత బుద్ధిమంతులు గుర్తింప సాగిరి. ఇది కార్లయిలు మహాశయునియొక్క ఆధ్యాత్మికస్వీయచరిత్ర మని గ్రహించిరి. పందొమ్మిదవ శతాబ్దమునకు నొక సందేశమును "సార్టర్ రిజార్టసు" వినిపించుచున్న దని తెలిసికొనిరి. మీరు చెవులు మూసికొనుడు; గ్రంథమును భస్మము గావింపుడు; ప్రవక్తను దూషింపుడు, చెరసాలయం దుంచుడు, మృత్యువు నోట వేయుడు, ఏమయిన జేయుడు. సత్యమును మాత్రము చంపజాలరు! క్రీస్తును జంపిరి గాని ఆతడు బోధించిన సత్యము నాటంకపరచుట ఎవరికి శక్య మయినది? గెలీలియో (Galileo) ను చెరసాలయందుంచి బహుబాధల బెట్టిరి గాని ఆతడు నిరూపించిన సత్యమును చెరసాలయం దుంచి మరుగుపరచుట యెవరికైన సాధ్యమయినదా? కార్లయిలును పరిహసించిరి. "సార్టర్ రిజార్టసు" ను దృణీకరించిరి. కాని కార్లయిలు ఉపదేశించిన సత్యము జయము గాంచినది. ఆయన సందేశము వ్యాప్తి జెంది సఫలమైనది.

# 3

పందొమ్మిదవ శతాబ్దమునందు భౌతికవిజ్ఞానశాస్త్రము బహుజనసమ్మతి బడసి భావప్రపంచమును నిరంకుశముగ పరిపాలించు చుండెను. వైషయికనాగరికతకు ఈ నూతనవిజ్ఞానము కుడిహస్త మయ్యెను. మతము వెనుకబడెను. జనులు తమ మనోనేత్రమును విప్పి నలుదెసల జూడ నారంభించిరి. కార్యములకు కారణము లారయ మొదలిడిరి. హేతువు మూఢవిశ్వాసముయొక్క స్థానము నాక్రమించుకొనెను. స్వభావసిద్ధమగు నియమముల ననుసరించి నడచు ప్రకృతియందు ఈశ్వరునికి స్థాన మున్నటుల గాన్పింప లేదు. జీవనమునందు మతమున కావశ్యకత యున్నట్లు తోచ దాయెను. అంతయు జడపదార్థమే కాని ఆత్మ యబద్ధ మనిరి. జన్మాంతరము శూన్య మనిరి. మతము కల్పన యని వాదించిరి. బైబిలునందు దేవుడు ఏడు దినములలో విశ్వమును సృజించెనని వ్రాయబడి యున్నది. శాస్త్రజ్ఞు లది కల్లయని నిరూపించిరి. క్రైస్తవమత ప్రమాణగ్రంథములయందు అసత్యముల గాంచినప్పుడు క్రైస్తవమతమే మతమని భ్రమించుటచేత మత మసత్య మని బహుజను లూహిం

చిరి. మతముయొక్క అవసానకాల మరుగు దెంచెనని చాలమంది నమ్మిరి. ఇట్లు కొందరు నాస్తికు లయి పోవు చుండిరి.

మరికొందరు "ఆత్మజ్ఞానము సంపాదింపవలయును. ఈశ్వరుని స్వభావము తెలిసికొనవలయును. ప్రపంచము నం దేదియు శాశ్వతము కాదు. నిన్ను నీవు తెలిసికొనుము (know thyself). అదియే ముఖ్యము ; తదితరములు కేవల మనావశ్యకము." అని వాదించుచు కార్యశూన్యులై మెట్టవేదాంతములందును కుతర్కములందును తమబుద్ధిని వ్యర్థపరుచుచు నిరర్థకజీవనముల గడపుచుండిరి. అట్టి సంధిగ్ధసమయమునందు అధర్మమును రూపుమాపి ధర్మమును రక్షించుట కవతరించెనో యన కార్లయిలు మహాత్ముడు జన్మించెను. సత్యమును బ్రకటించెను. ధర్మమును రక్షించెను.

## 4

ప్రకృతి జడము కాదనియు, ప్రకృతియందలి సమస్త శక్తులను ప్రేరణ చేయుచున్న శక్తిస్వరూపు డొకడు కలడనియు, కార్లయిలు తన "సార్టర్ రిజార్టసు" నందు

బోధించెను. ప్రకృతియును మానవశరీరమును దుస్తుల వంటివి. దుస్తు లేవిధముగ శరీరము కాక శరీరమునకు భిన్న మయినవో, అట్లే శరీరము పురుషుడు కాక పురుషునికి భిన్న మయినది. మనము జడపదార్థ మనుకొనున దంతయు యథార్థముగ ఆత్మయొక్క ప్రకాశమే. ఈ విశాలవిశ్వము నిరాకారుడును నిర్గుణుడును అనంతుడు నగు పరబ్రహ్మముయొక్క దుస్తుల వంటివి. ఈశ్వరు డెక్కడనో పరలోకమునందు దేవతలమధ్య కూర్చుండి ఈ విశ్వమును పరిపాలించు వాడు కాక పరమాణువు మొదలు బ్రహ్మాండమువరకు సమస్తవస్తువులకును అంతరాత్మయై యున్నాడు. ఏ వస్తువు చూచినను, ఏ శక్తి గాంచినను, ఏ సౌందర్యము పొడగన్నను, అన్నియును ఈశ్వరుని మహిమనే వెల్లడించుచున్నవి. ఇదియే దుస్తుల యొక్క తత్త్వ మని కార్లయిలు బోధించెను. భౌతిక విజ్ఞానముయొక్క సార మంతయు నీ దుస్తుల తత్త్వము నందే యున్న దనియు, మానవసంఘము ఈ దుస్తుల తత్త్వము నాధారము చేసికొనియే నిర్మింపబడిన దనియు, ఆతడు నుడివెను.

కంటికి గాన్పింపని పదార్థములయొక్క సత్యమును కార్లయిలు నిరూపించినను, చక్షుర్గోచరము లగు వాస్త

వముల నాతడు లెక్కగొనక పోలేదు. ఈ ప్రపంచము మిథ్యకాదు. మాయయందు చిక్కుకొని కొట్టుకొను చున్న మనుష్యుడు ప్రపంచము మిథ్య యని తెలిసికొని నిర్వ్యాపారుడై మాయనుండి విముక్తి పొందుటే జన్మ సార్థకత యని కార్లయిలు ఎన్నడును నమ్మియుండలేదు. మనుష్యుడు స్వర్గమునుండి జన్మించిన వాడు. ఆవశ్యక తకు దాసుడు గాక దానిని జయించు వాడని కార్ల యిలు వాదించెను. అన్యాయ్యముతోను క్రౌర్యముతోను పాపముతోను నిండి దుఃఖభూయిష్ఠ మగు ఈ ప్రపంచము నందు మన విధి ఈశ్వరుని యుద్దేశముల నెరవేర్చుట యందే కలదని ఆతని నమ్మకము. ప్రార్థన యన కన్నులు మూసికొని యేవో కొన్ని మంత్రములో కొన్ని వాక్య ములో ఉచ్చరించుట కాదనియు, యథార్థమును స్వాభా వికమును పవిత్రమును నిష్కపటము నగు ప్రార్థన కృషి యందే కలదనియు, ఆతడు కృషియొక్క పవిత్రతను గణ్యా తను ఆవశ్యకతను గురించి విశేషముగ బోధించెను. పని చేయవలయును. విసుగు చెందక మన విధాయకకృత్య ములను నెరవేర్పవలయును. సౌఖ్యము కాదు, మనము ప్రేమింపవలసినది. ఈశ్వరుని ప్రేమింపవలయును. ఇదియే శాశ్వతమగు సత్యము. "సార్టర్ రిజార్టస్" నుండి

తీసిన ఈ క్రిందివాక్యములు కార్లయిలు మహాశయుని సందేశముగ గ్రహింపవచ్చును. "సుఖమును ప్రేమింప కుము; ఈశ్వరుని ప్రేమింపుము. ఇదియే శాశ్వత సత్యము. నీవు ధర్మమని గ్రహించునట్టియు, నీ కతిసమీపమున నుండునట్టియు ధర్మమును మొదట ఆచరింపుము. అపుడు నీ రెండవ విధాయకకృత్యము నీకు స్పష్టతరమై యుండును...అల్లకల్లోలముగా నుండకుము. ఎవరును పని చేయుటకు వీలులేని రాత్రిసమయము సమీపించుచున్నది కావున దినమని పిలువబడు ప్రస్తుతకాలము నందే పాటుపడుము."

## 5

ఇంకను "వీరులు, వీరపూజ", "భూత వర్తమానములు", "ఫ్రెంచి విప్లవము" మొదలగు ననేకగ్రంథములు కార్లయిలు రచియించెను. వాని నన్నిటియందును ఆతని భావోత్కృష్టతయు ఉపజ్ఞయు సూక్ష్మదృష్టియు స్వతంత్రశైలియు తేటతెల్లములు. ఈ చిన్న వ్యాసమునందు ఆతని గ్రంథముల సంపూర్ణవిమర్శనము గాని, ఆతని భావములను విస్తరించి వ్రాయుట గాని

సాధ్యము కాదు గనుక ఒకటి రెండు విషయములు మాత్రము సంగ్రహముగ తెలిపెదను.

ప్రపంచమంతయు ఈశ్వరుని వికాస మని నమ్మినవా డగుటచేత, మానవచరిత్రయందు ఈశ్వరుని హస్త మాయన దర్శింపగలిగెను. మానవాభ్యుదయమును సంఘపరిణామమును పరమపురుషుని ప్రేరేపణఫలితములే యనియు, మానవసమాజమునందు భగవానుని క్రియా విధానమును చూపునదే చరిత్రయనియు, ఆతడు విశ్వ సించెను. వేదము, బైబిలు, కొరాను మొదలగు గ్రంథముల వలెనే మానవుల సామాన్యచరిత్ర కూడ ఈశ్వరుని మహిమను ధర్మశాసనమును వెలిపుచ్చుచున్నది. చరిత్ర లౌకికవేద మని చెప్పవచ్చును. ధర్మసూత్ర ములయొక్క చర్య ప్రత్యేక వ్యక్తిజీవనములో నే విధ మున కాననగునో, అదే విధమున విశ్వమానవకోటి చరిత్రయందును జాతుల ధర్మాధర్మకార్యములయొక్క ఫలితములు కాననగును. ధర్మజీవనము వ్యక్తులకు వలెనే జాతులకును సౌందర్య మిచ్చుచున్నది; అధర్మజీవ నము వినాశహేతు వగుచున్నది. మానవచరిత్రనుగురిం చిన కార్లయిలుయొక్క ముఖ్యసిద్ధాంతములలో నిది మొదటిది.

రెండవ సిద్ధాంతము: మానవచరిత్ర యథార్థముగ వీరులయొక్క చరిత్రయే కాని వేరు కాదు. సామాన్య మానవులకంటె ధైర్యశాలులును విజ్ఞానవంతులును పరాక్రమశీలురు నగు వీరులు అప్పుడప్పు డుద్భవించి వారి వారి జాతులయొక్క చరిత్రను నిర్మాణము చేయు శిల్పులు. వీరులు ఈశ్వరాంశసంభూతు లనియు, కావున వారి యాజ్ఞానుసారముగ నడచుకొనుచు వారి ననుకరించి జీవించుటయే సామాన్యమానవుల విధికృత్య మని ఆతడు బోధించెను.

ఈ రెండు సిద్ధాంతములును అప్పటి జనసామాన్యము యొక్క యభిప్రాయములకు విరుద్ధములుగ నుండెను. అసలు దేవుడే లేడని వాదించు వారు చరిత్ర దేవుని మహిమను అనుశాసనములను వ్యక్తీకరించు నితిహాస మనిన నెట్లొప్పుకొందురు? అది యట్లుండెను.

ఇక సాంఘిక రాజకీయ విషయములలో జనుల దృష్టి పథము నాక్రమించి వారి హృదయముల నుద్బోధించు చున్నది ప్రజాస్వామ్యాదర్శము. స్వభావముచేత మనుష్యులందరును సమాను లనియు, సంఘములోని హెచ్చు తగ్గులు స్వార్థపరులచే కల్పింపబడిన కుహనాతారతమ్యములు కాని యథార్థములు కావనియు, వానిని నిర్మూ

లము గావించి మానవసమానత్వముయొక్క సిద్ధాంత
ముమీద సంఘమును పునర్నిర్మాణము చేయవలయు
ననియు, ఆందోళనము జరుగు కాలము వీరపూజాతత్త్వ
మును గ్రహించుటకు కేవలము అనుకూల మగు సమ
యము కాదు కదా? మహావీరుల కనుగొని వారి నను
సరించి జీవించుట దుర్లభ మను నిరాశమీద ప్రజాస్వా
మ్యాదర్శము ఆధారపడి యున్నదని నుడివిన కార్ల
యిలు భావప్రవాహమున కెదు రీదవలసి వచ్చెను.

కాని, ఆయన నిరుత్సాహము చెందక తన నిరుప
మాన జ్ఞానప్రతిభచేతను, కార్యదీక్షచేతను, నైతిక
శౌర్యముచేతను, వాక్ప్రౌఢిమచేతను, తన సిద్ధాంతము
లను సంఘమునందు చొప్పింప జేసెను. ఫలితము?
పాశ్చాత్యభావప్రపంచమునందు నేడాతని సిద్ధాంత
ములు సామాన్యధర్మము లయినవి; ఆంగ్లసారస్వత
చరిత్రయందు ఆయన కొక ఉత్తమస్థాన మేర్పడినది;
పందొమ్మిదవ శతాబ్దమునకు కార్లయిలు ప్రవక్తయని
ఆమోదింపబడినది.

# ఎమర్సను

"He is the friend and aider of those
who would live in the spirit."

MATTHEW ARNOLD.

కార్లయిలు వ్రాసిన సార్టర్ రిజార్టసు గ్రంథము యొక్క ఉత్కృష్టతను గ్రహించినవారిలో ఎమర్సను మొదటివాడు. సూర్యు డుదయించినపుడు మొదట ఆతని కాంతికిరణములు మహోన్నతము లగు పర్వత శిఖరములందు ప్రకాశించునట్లు జ్ఞానభాస్కరు డనదగు నొక మహానుభావుడు సారస్వత ప్రపంచమునం దుద్భవిల్లినపుడు ఆతని జ్ఞాన తేజమును ప్రప్రథమమున ఉన్నత జీవు లగు పురుషాగ్రేసరులు గుర్తించి గౌరవించి యానందించుదురు. కార్లయిలుయొక్క గ్రంథరాజమందలి అత్యున్నతభావముల కచ్చెరువంది ఆయనను జూడవలె నని ఎమర్సను మిక్కిలి సకుతూహలు డయ్యెను. ఎమర్సను అమెరికా దేశస్థుడు. కార్లయిలుయొక్క దర్శనార్థమై ఆతడు స్కాట్లండుకు వెళ్లెను. ఒకరియెడ నొకరికి ప్రేమయు గౌరవమును కుదిరెను. అప్పటినుండియు వారిరువురును గొప్పమిత్రులయిరి. అమెరికా దేశములో

కార్లయిలు గ్రంథముల ప్రచారమునకు ఎమర్సనును, ఇంగ్లాండులో ఎమర్సను పుస్తకముల వ్యాప్తికై కార్లయిలును పాటుపడి ఒకరికొకరు సాహాయ్యము చేసి కొనుచు తమ ఉదారభావముల ప్రకటనకై వారు కృషి సలుపుచుండిరి. పాశ్చాత్యభావ ప్రపంచమునందు కార్లయిలుకువలె ఎమర్సనుకు నొక గౌరవస్థానము కలదు.

సాంఘిక నైతిక మత విషయములందు కార్లయిలు వలె ఎమర్సను ఉన్నతాభిప్రాయములు కలవాడు. కాని వారిరువురకును స్వభావమునందు కడుంగడు భేదము కలదు; వారి రుచులు భిన్నములు. కార్లయిలుకు ఖండనవృత్తియందు కడు ప్రీతి. దుష్టవిగ్రహములను భస్మీపటలము గావించుటలో అతడసమానుడు. ఎమర్సనన్ననో సాత్వికుడు, ధ్యానాభిరక్తుడు. కార్లయిలు పరుషభాషణుడు; ఎమర్సనుయొక్క మాటలయందు అమృత మొలుకుచుండును. మొత్తముమీద వేషభాషల లోను శైలిలోను భావములలోను కార్లయిలు మోటుగ కాన్పించును. ఎమర్సనుయొక్క సౌకుమార్యము, నాగరికత, సౌమ్యము, మృదుత్వము వర్ణనీయములు. కాని మూలసిద్ధాంతములలో వారిరువురికి భేద మత్యల్పము. అందువలన కార్లయిలు మోటుపడిన ఎమర్సననియు,

ఎమర్సను సౌకుమార్యము చెందిన కార్లయి లనియు చెప్పవచ్చును.

## 2

కార్లయిలు నమ్మినవిధముననే ఈ విశ్వము ఆత్మ యొక్క ప్రకాశమే యని ఎమర్సను తలచెను. బ్రహ్మాండము ఆత్మయొక్క బాహ్యాస్వరూప మని ఆయన నుడివెను. ప్రకృతియంతయు నొక చిహ్న మని ఆయన యూహించెను. ప్రతివస్తువు ఒక భావమును ప్రకటించుచున్నది. మనము చిహ్నములు. మనము నివసించు ప్రపంచము చిహ్నము. మన పుట్టువు చిహ్నము. మృత్యువు చిహ్నము. మనము చేయు పని చిహ్నము. మనము ఉపయోగించు పనిముట్లు చిహ్నములు. అన్నియు గుర్తులే కాని, విషయమోహములందు పడిపోయి అన్నియు భావములే యను యథార్థము మనము గ్రహించుట లేదు. నీరు ఏవిధమున మంచుగడ్డయై తిరిగి నీ రగుచున్నదో, అదేవిధమున భావము ప్రపంచ మయి తిరిగి భావముగ మారిపోవుచున్నది. ఎక్కడను నాశములేదు. ఎక్కడను అపవిత్రత లేదు.

కార్యములు భిన్నములు ; కాని కారణ మొక్కటియే. రూపములు వివిధములు ; కాని పదార్థ మొక్కటియే. వ్యక్తులు మెండు ; కాని జీవ మొక్కటియే. కారణము యొక్క ఏకత్వమును గుర్తించినపిమ్మట కార్యముల యొక్క భిన్నత్వమును చూచి యెవరు భ్రమపడుదురు? కవీశ్వరునికి, తత్త్వజ్ఞునికి, భక్తునికి, జ్ఞానికి, అన్ని వస్తువులును పరిశుద్ధములే; అన్ని కార్యములును సౌభాగ్యకరములే; అన్ని దినములును పవిత్రములే; సమస్తపురుషులును ఈశ్వరాంశసంభూతులే. ప్రతినిమిషమును, ప్రతి వస్తువును మనకు విద్య గరపుచున్నవి; జ్ఞాన మొసంగుచున్నవి. ప్రతిరూపమునందును వివేకము చొప్పింపబడియున్నది. ఏదియును అనవసరము కాదు; వృథా కాదు. దేనికిని నాశము లేదు ; ఎందును మృత్యువు లేదు. మనకు సంబంధము లేనట్టియు, ప్రస్తుతము మన క్షేమమున కవసరము కానట్టియు వస్తువులను మనుష్యులను మననుండి ఈశ్వరుడు మరుగుపరచుచున్నాడు. అప్పుడు మనము ఆ వస్తువు నశించిన దనియు, ఆ మనుష్యుడు మృతిచెందె ననియు చెప్పుదుము. కాని, యథార్థముగ నాశము లేదు ; మృత్యువు లేదు. మనుష్యులు మృతు

-లగు వారివలె నటించుచున్నారు ; కాని వారికి చిర
జీవనము కలదు. ఇట్లని చెప్పె నాతడు :

Men feign themselves dead, and endure mock funerals and mournful obituaries and there they stand looking out of the window sound and well in some new and strange disguise.

ఈవిధమున సాంసిద్ధికతత్త్వ మను (Transceden-talism) వేదాంతమును మనోహరమగు శైలిలో బహునిపుణతతో వ్యక్తీకరించెను.

## 3

కార్లయిలు కర్మయోగి, కార్యాభిలాషి. ఎమర్సను జ్ఞానమునకు ఎక్కువ విలువ నిచ్చెను ; ధ్యానము నభి లషించువాడు. ప్రతికార్యముయొక్క ఉత్పత్తియు భావమునందు కలదని ఆయన గుర్తించెను. "భావము కార్యముయొక్క పితామహుడ" ని ఆయన నుడివెను. మన నడతయు మన కార్యములును మన భావముల మీద నాధారపడి యున్నవి. యోచించుట అన్ని పనులకంటె కష్టతరమైన దని ఆయన భావించెను. యోచించుట నిజముగ పనిచేయుటయే. యథార్థ మగు

పని నిశ్శబ్దనిమిషములందు చూడ నగును. నిజమగు పని మన వృత్తులయందును ధనార్జనయందును వివాహాది కృత్యములయందును కాక, ఒక నిశ్శబ్దభావమునందును ఒక యుత్కృష్టమగు తలంపునందును కలదు. ఏ కార్యముయొక్క ఘనతయైనను ఆ కార్యమునందు కాక, ఆ కార్యము వెనుకనున్న భావము ననుసరించి యుండును. ప్రధానము లయినవి భావములు. భావముల నెంత వరకు ప్రతిబింబించుచున్నవో, అంతవరకే కార్యములు ముఖ్యములు. కర్తలకంటె భావము లెక్కువ ఉత్కృష్టములే యయినను, ఎమర్సను కర్తలయొక్క ప్రాముఖ్యము గమనింపక పోలేదు. "Action is subordinate but it is essential." అని ఆయన చెప్పెను. భావముల కున్నంత ప్రాముఖ్యము కర్తలకు లేకపోయినను, అవి చాల యవసరములు. భావములు కర్తలుగ మారిన యపుడే, అవి పరిపక్వ మగుచున్నవి. కర్తలు చేయు నపుడు, భావప్రకటనయే మనము దృష్టియం దుంచుకొన వలయును. కార్యసాధనకొరకు భావములను మరుగు పరుప కూడదు. ఫలముల నపేక్షించి కాదు, మనము పనిచేయవలసినది. కార్యములద్వారా మన భావములు తమ్ము తాము ప్రకటించుకొనుటకు నవకాశమిచ్చుటయే

మన విధి. ఈ విధి ననుసరించియే "హృదయపూర్వక ముగ చేయుటకు వీలులేని పనిని నేను చేయకుండ నుండ వలె నని నా కోరిక" యని ఎమర్సను నుడివి, యూని టేరియన్ చర్చియొక్క సిద్ధాంతములతో తాను పూర్ణ ముగ నేకీభవింప జాలనందున ఆ చర్చియందు ఆచార్య త్వము హృదయపూర్వకముగ చేయుటకు వలనుపడక పోవుటచే ఆ పదవిని ఆతడు వదలుకొనెను. కాపట్యము, అసత్యము, నటన కార్లయిలుకు ఎంత అసహ్యకరములో ఎమర్సనుకు కూడ నంత అసహ్యకరములుగ నుండెను.

## 4

ఎమర్సను వ్యక్తిస్వాతంత్ర్యవాది. సంఘము, ఆచారములు, గతము (the past) వ్యక్తిస్వాతంత్ర్యమును భంగపరుచుటకు సదా ప్రయత్నించుచున్నవి. సంఘము వ్యక్తిస్వాతంత్ర్యమును గౌరవింపదు; స్వతంత్ర వ్యక్తిని తన విరోధిగ భావించును. ఆచారముల ననుసరించి నడచుకొనుటయే ధర్మప్రవర్తనగా అది గణించును. శతాబ్దములు ఆత్మగౌరవమునకును వ్యక్తిస్వాతంత్ర్యమునకును గర్భశత్రువులు. ఎవరు మనుష్యనామమున కర్హాత

గాంచ నిచ్ఛగించుచున్నారో, వారు సంఘముయొక్కయు ఆచారములయొక్కయు గతముయొక్కయు బానిసత్వ మునుండి తప్పించుకొనవలె నని ఎమర్సను నుడివెను. ప్రతిమనుష్యుడును ఈశ్వరపుత్రుడే. ఈశ్వరుని సత్యరాజ్య మునందు, ధర్మసంస్థానమునందు ప్రతివ్యక్తికిని సమాన ముగ స్వతంత్ర మగు హక్కుకలదు. మనుష్యుడు స్వతం త్రుడుగ జన్మించుచున్నాడు. స్వతంత్రుడుగ జీవింపవల యును; స్వతంత్రుడుగ తిరిగి పోవలయును. ప్రపంచము నందు మానవశరీరముకంటె పవిత్రమైన దేవాలయము లేదు. ఈశ్వరుడు మానవహృదయమునందు సర్వదా అధిష్ఠించి యున్నాడు. దుర్బలుడును శక్తివిహీనుడును ఆశాబద్ధుడును పాపియు నగు మనుష్యుని జీవనముతో సర్వశక్తిసంపన్నుడును అపాపవిద్ధుడును జ్ఞానమూర్తియు ఆనందమయుడు నగు పరమాత్మ అత్యద్భుతముగ నల్లు కొని యున్నాడు. మనుష్యుని శక్తికి, జ్ఞానమునకు, పుణ్య మునకు కారణ మదియే.

మానవహృదయమునందు ఈశ్వరుని పీఠము ఎవరు చూచుచున్నారో, మానవజ్ఞానమునందు బ్రహ్మము యొక్క ప్రేరణ ఎవరు గుర్తించుచున్నారో, మానవా భిజ్ఞతయందు భగవానుని ప్రకాశము ఎవరు కాంచుచు

న్నారో, మానవాత్మయొక్క వ్యాపారములందు పర మాత్ముని సంకల్పములను ఎవరు దర్శించుచున్నారో, మానవజీవితమునందు ఈశ్వరలీలలను ఎవరు పరిశీలించు చున్నారో, వారు వ్యక్తియొక్క ఉత్కృష్టతయు విలు వయు గ్రహింపగలరు. వారు శతాబ్దములకు గాని సం ఘమునకు గాని ఆచారములకు గాని బానిసలుగ నుండ జాలరు; హృదయనాథు డగు పరబ్రహ్మమునకు తప్ప నెవరికిని తల వంచరు. వారి స్వభావమునుండి, వారి హృదయమునుండి జనించిన ధర్మము తప్ప మరియే ధర్మ మును వారు మెచ్చరు. ధర్మము బాహ్యమునుండి మెడల మీాద వేయబడు బరువు కాదు. హృదయాంతరాళము ధర్మముయొక్క జన్మస్థానము. భూగర్భమునుండి వృక్ష మును, వృక్షమునుండి పుష్పమును, పుష్పమునుండి ఫల మును ఏ విధముగ పుట్టుచున్నవో, అదేవిధమున మన హృదయసీమలనుండి మన ధర్మమును, మన ధర్మము నుండి మన విధులును, మన విధులనుండి మన కర్మ లును జనింపవలయును. మన ప్రకృతినుండి జనన మొం దని ధర్మములు మనకు నైసర్గికములు కావు; మనలను బంధించు అధికారము వానికి లేదు. వాని ననుసరించి మనము చేయు కార్యములు పవిత్రములు కావు; ఆత్మో

పలబ్ధికి సహకారములు కావు. మన కార్యములన్నియు మన హృదయములనుండి యుద్భవించిన ధర్మముల ప్రతిబింబములుగ నుండవలయును. అప్పుడే వానికి విలువ కలదు. అప్పుడే అవి మన యభివృద్ధికి తోడ్పడగలవు.

సామాన్యముగ నాగరికదేశములందలి మనుష్యులు బహుకాలము గతమునకును సంఘమునకును ఆచారములకును దాస్యము సలుపుటవలన విశ్వాసమును ధైర్యమును బలమును శౌర్యమును కోలుపోయి ధర్మభీరువులగుచున్నారు. వారికి సత్యమును చూచిన భయము, మృత్యువును చూచిన భయము. కావుననే వారియందు పూర్ణపురుషులు, మహాత్ములు బయలుదేర కున్నారు. తమ కళలు, తమ వృత్తులు, తమ వివాహములు, తమ మతము తమ హస్తములందు లేక, తమకొరకు సంఘము చేత నేర్పరుపబడుచున్న వనియు, కావున వారు ధర్మమువిషయమై స్వాతంత్ర్యమును కోలుపోయి రనియు ఎమర్సను ఆనాటి నాగరికుల నిరసించెను. హృదయము నందు ఈశ్వరుని దర్శించి, వివేకము ద్వారమున ఈశ్వర వాణిని గ్రహించి, ఈశ్వరయోధు లయి సత్యపతాకము క్రిందనే యెల్లపుడును నడచుచు అసత్యమును అధర్మమును ఏమూలనుండి ఏరూపమున వచ్చినను ఖండించుచు

మానవుడు జీవించినప్పుడే, వాని జీవితము సార్థక మగు నని ఆయన గంభీరముగ నుపన్యసించెను.

## 5

ఎమర్సను ధ్యానాభిరక్తుడగుటచే ఆశాపీడితమును దుఃఖభూయిష్ఠమును వ్యాకులసహితము నగు జనబాహుళ్యముయొక్క జీవితరంగమునకు దూరమున నిర్మల శాంతివాతావరణమునందు తన జీవితమును నిత్యసంతుష్టుడై గడపెను. గ్రంథరచనయందు కూడ ఆతడెక్కువ అభిలాష చూపి కృషిసలిపినవాడు కాడు. "ప్రకృతి", "ప్రతినిధు లగు పురుషులు" అను ఏవో రెండుమూడు పుస్తకములు మాత్రము గ్రంథరూపమున వ్రాసెను; కాని యిప్పుడాతని గ్రంథము లనుకొనువానిలో చాల భాగము ఆతని ఉపన్యాసములే. ఆతని సిద్ధాంతములు ప్రజాస్వామ్యాదర్శమున కనుగుణముగ నున్నను, రుచులును నడవడియు జీవనవిధానమును అగ్రకులానుబంధముగనుండెను. కావుననే ఒకానొక పాశ్చాత్యవిమర్శకుడు "ఎమర్సను జ్ఞానప్రతిభాశీలు డగు బ్రాహ్మణుడు" అని చెప్పెను. ఆత్మయొక్క యథార్థతను నిత్యత్వమును

తెలిసికొనినవాడు కావున, పూజనీయమును నిర్మలానంద కరము నగు ఆధ్యాత్మికజీవనము గడపి సంఘముయొక్క భక్తిగౌరవములకు పాత్రుడయ్యెను. ఆధ్యాత్మికజీవనము గడప నభిలషించువారలకు ఆతని పుస్తకములు సర్వదా యత్యంత సహాయకరములుగ నుండి ఆంగ్లసారస్వత ప్రపంచమున ఆతని కొక శాశ్వతపదవిని సంపాదించినవి.

# గెటి

"The immediate debt we owe to Goethe is greater than the debt we owe to any man since Greek days."

OSCAR WILDE.

పందొమ్మిదవ శతాబ్దముయొక్క పాశ్చాత్యభావ ప్రపంచమును గురించి యోచించునపుడు, గెటి మహాశయుని నామముకంటె ముఖ్యమయిన నామము మరియొకటి కానరాదు. ఈతడు కార్లయిలుకు గురు వని చెప్పవచ్చును. గెటీకి మించిన వాడు పందొమ్మిదవ శతాబ్దమున పాశ్చాత్యదేశములం దెవరును లేరని కార్లయిలు నుడివెను. గెటి పందొమ్మివద శతాబ్దముయొక్క ఆత్మ యని ఎమర్సను పొగడెను. గెటి జర్మనీదేశస్థుడు. జర్మనీయొక్క జ్ఞానప్రతిభయు సుగుణరాశియు గెటి రూపమున మూర్తీభవించె ననిన నతిశయోక్తి కాదు. ఇటలీ దేశమునకు డాంటి (Dante) వలెను, ఇంగ్లండునకు షేక్స్పియరు వలెను, హిందూదేశమునకు కాళిదాసు వలెను, జర్మనీకి గెటి శిరోభూషణముగ నుండెను. పందొమ్మిదవ శతాబ్దమందలి మహాపురుషులలో గెటి అగ్రగణ్యుడు; జర్మనీదేశస్థులలో ఉత్కృష్టుడు. పందొ

మ్మిదవ శతాబ్ద మన నేల! జర్మని యన నేల! ప్రపంచ మందలి మహాపురుషులలో గెటె యొక్కడని, నిస్సందేహ ముగ చెప్పవచ్చును.

ఒకవిధమున చూచిన దేశకాలములు మహాపురుషు లకు హద్దు లేర్పరుప జాలవు. కాళిదాసుయొక్క కాల మేది? కాళిదాసుయొక్క దేశ మేది? ఆయన గ్రంథ రాజములు ఏ కాలమందు పఠింపబడుచున్నవో, అది కాళిదాసు కాలమే. ఏ దేశమందు ఆమహాశయుని భావ ములు గ్రహింపబడుచున్నవో, అది కాళిదాసు దేశమే. మహాపురుషులు సర్వదేశములకును సర్వకాలములకును చెందిన వారు. సర్వప్రపంచముయొక్క పౌరు లయి, సర్వప్రపంచముయొక్క కవు లయి, సర్వప్రపంచము యొక్క గురువులయి, సర్వకాలములందు జీవించు సమస్త దేశస్థులకును మాననీయు లగు మహాపురుషులు బహు స్వల్ప సంఖ్యాకులుగ నుందురు. ప్రపంచవాఙ్మయమును నిర్మాణము చేయవలయు నను అద్భుతాశాప్రేరితు డగు గెటె మహాశయుడు అట్టి పురుషవరేణ్యులలో నొక్కడు.

## 2

గెటి కవీశ్వరుడు, తత్త్వవేత్త, శాస్త్రజ్ఞుడు. ఇరువది వర్షముల ప్రాయమపుడే జర్మనీలోని మహాకవీశ్వరులలో నొక్కడని ఆతడు పేరు గాంచెను. ఆతడు వ్రాసిన 'విల్ హెల్మ్ మైస్టరు' (Wilhelm Meister) అను నవల ప్రపంచమందలి మహానవలలో నొకటిగ పరిగణింప బడుచున్నది. 'ఫాస్టు' (Faust) అను నాటకము ప్రపంచమందలి గ్రంథములలో నెల్లను ఉత్కృష్ట మయిన దని జర్మనీదేశస్థుల నిశ్చితాభిప్రాయము; షేక్స్పియరు నాటకములకంటెనుగూడ కొన్ని విషయము లలో శ్రేష్ఠమయిన దని కొందరు పాశ్చాత్యవిమర్శకులు తలచుచున్నారు. ఈ గ్రంథమును చదువని వారి కెవ్వరికిని పండితనామమున కర్హత లేదని పాశ్చాత్య జనాభిప్రాయము. సార్టర్ రిజార్టను కార్లయిలుయొక్క ఆధ్యాత్మికజీవనచరిత్ర మని చెప్పియుంటిని గదా! అట్లే ఫాస్టు గెటీయొక్క స్వీయచరిత్ర. ఆతని తత్త్వ మును భావములును ఆదర్శములును ఈ పుస్తకమును చదివిన తెలిసికొన వచ్చును. ఎన్ని ప్రలోభనములకు లోనయి పాపపంకమున చిక్కుకొనినను, ఎవ్వరు ఉత్తమ జీవనముయొక్క ఆశను ;విడనాడక సర్వదా పాటుపడు

చున్నారో, వారు రక్షింపబడుచున్నా రను భావము ఈ పుస్తకముయొక్క మూలసూత్రముగ గణింపవచ్చును. ఫాస్టు ఎన్ని ప్రలోభనములచే ఆకర్షింపబడినను, తన ఆదర్శముల విడువక, ఉత్తమజీవనకాంక్ష కోలుపోక, ఎడతెగక పరిశ్రమ చేసినవా డగుటచే, తుదకు రక్షింపబడెను. ఆతని ఆత్మను దేవతలు గగనమార్గమున గొని పోవుచు నిట్లని పాడిరి :

"He who strives in never-wearying activity can be saved by us."

## 3

జీవితము మహాపవిత్రమయిన దని గెటె తలచెను. మనకు ఈశ్వరునిచే ప్రసాదింపబడిన యన్నిటిలోను జీవనము ఉత్తమమయిన దని ఆతడు చెప్పెను. ఈశ్వర ప్రసాదిత మగు నీ యమూల్య జీవితమును అతిజాగ్రత్తతో వినియోగించుట ప్రతిమనుజుని కర్తవ్యము. తుచ్ఛసుఖములందును అపవిత్రపు కార్యములందును కొరగాని భేషజములందును జీవితమును వృథాపుచ్చుట మహాపాపము. ప్రతివ్యక్తియు నొక యుద్దేశముతో ఒక ప్రత్యేక

మగు పనికొరకు సృజింపబడుచున్నాడు. మానవదేహ మునందు అనావశ్యకమగు అవయవ మెట్లు లేదో, అట్లే విశ్వమానవకోటిలో అనావశ్యకమగు జీవిత మొక్క టియు లేదు. ప్రతిమనుజునికిని తానే నిర్వహింపవలసి నటువంటియు, ఇతరు లెవ్వరును చేయలేనటువంటియు విధాయక కార్య మొకటి కలదు. ఆ కార్యమేదియో తెలిసికొని దానిని నిర్వహించుటకు తన యావచ్ఛక్తిని వినియోగించుట మానవుని ప్రధానకర్తవ్యము. కార్య ము మూలముననే మనము ఆత్మోపలబ్ధిని పొందుదుము. కార్యము మూలముననే మనము సత్యమును గ్రహింప గలుగుదుము. కార్యసాధనవలననే మనము జీవితము యొక్క ప్రతిసమస్యకును ఉత్తర మీయగలుగుదుము. కార్యనిర్వహణము వలననే మనము ఆత్మజ్ఞానము పొంద గలుగుదుము. కావున ఏ కార్యము నిర్వహించుటకు మనము జన్మించితిమో, ఆకార్యము తెలిసికొని సాధించి ననే ఆత్మోపలబ్ధిని పొందుదుమని గెటి తన గ్రంథముల యందు ప్రకటించెను. ప్రతి వ్యక్తియు తన శక్తుల నన్నిటిని అభివృద్ధి పొందించుకొనుట యావశ్యక మని యు, దానికి కార్యసాధనమె మార్గ మనియు అతడు నొక్కి చెప్పెను.

## 4

వ్యక్తిత్వముయొక్క యుత్కృష్టతను, వ్యక్త్యభివృద్ధి యొక్క యావశ్యకతను గురించి గెటి దృఢాభిప్రాయ మును తెలిపినను, గెటి చెప్పిన వ్యక్తిత్వము స్వార్థపరత్వ మునకు మారుపేరు కాదు. వ్యక్త్యభివృద్ధికి స్వార్థత్యాగ ము అత్యవసర మని ఆయన గుర్తించెను. వ్యక్తిత్వ మన స్వార్థపరత్వము కాదు. స్వార్థత్యాగ మనిన వ్యక్తిత్వము యొక్క వినాశము కాదు. వ్యక్తిత్వమునకును స్వార్థత్యా గమునకును పరస్పరవిరోధ మెంత మాత్రమును లేదు. ఉత్తమాదర్శములకొరకు కొన్ని వాంఛలు, కొన్ని సుఖ ములు మనము త్యజింపవలయును. ఉత్తమజీవితమునకు వైరాగ్య మత్యవసరము. మన జంతుస్వభావమును చంపి ననే కాని మన యంతరమున నున్న దైవత్వము బహిర్గ తము కాదు.

గెటీయొక్క సిద్ధాంతములలో ఆత్మగౌరవమునకు (Reverence for self) విశేషప్రాముఖ్యము కలదు. కావుననే శరీరమును మాడ్చివేయు వైరాగ్యము యథా ర్థవైరాగ్యము కాదని ఆయన చెప్పెను. వ్యక్తిత్వమును రూపుమాప జేయు స్వార్థత్యాగము పవిత్రమగు స్వార్థ

త్యాగము కాదు. అది ఆత్మహత్య యగును. వ్యక్త్యభి వృద్ధికి సాధనభూతమగు వైరాగ్యమే నిజమగు వైరాగ్యము. ఆత్మనిరోధము లేనియెడల వ్యక్త్యభివృద్ధి యుండ నేరదని ఆయన తెలిసికొనెను.

గెటె మానవకోటియొక్క యథార్థైక్యత గుర్తించెను. జీవ మొక్కటియే యని ఆతని దృఢవిశ్వాసము. మానవకోటి ఒక్క కుటుంబ మని ఆతడు గ్రహించెను. కావుననే ఆతని వ్యక్తిత్వము స్వార్థపరత్వ మను సుడిగుండమున పడక తప్పించుకొని పోయెను. కావుననే తోడి మానవుల దుఃఖముల బాపుటకు ప్రయత్నము చేయుట, తోడి మానవుల సుఖ మధికము చేయుటకు కృషి సలుపుట, ప్రతిమనుష్యునికిని విధాయక మని గెటె నుడువగలిగెను. మానవుల ఐక్యతయందు దృఢవిశ్వాసము కలిగియుండుటచేత నే, దేశమునుండి దేశమును తెగగొట్టునట్టియు, జాతినుండి జాతిని విడదీయునట్టియు సంకుచితదేశాభిమానమునకు ఆతడు తావియ్యక పోయెను. స్వదేశాభిమానము కొంతవరకు అవసరమే; కాని అది మానవుని ప్రేమయొక్క చివరిమాట కాదు. అది సంపూర్ణసత్యము కాదు. వ్యక్త్యభిమానము, స్వకుటుంబాభిమానము, స్వగ్రామాభిమానము ఎట్లు అర్థ

సత్యములో, అట్లే స్వదేశాభిమానమును అర్ధసత్యము. మానవు లందరు ఈశ్వరసంతాన మనియు, కావున ఏక కుటుంబములోనివారనియు తెలిసికొనినపుడే, మనము సంపూర్ణసత్యమును గ్రహించుచున్నాము. అయినను స్వకుటుంబాభిమానము, స్వగ్రామాభిమానము లేని వారికి స్వదేశాభిమాన మెట్లు దుర్లభమో, అట్లే యిది నాదేశము, వారు నా జాతివారు అని గర్వముతో చెప్పుకొనజాలని వాడు సర్వమానవులందు ప్రేమ గలిగి యుండగల డనుకొనుటకు ఏమాత్రమును వీలు లేదు. ఉట్టి కెక్కలేనమ్మ స్వర్గమున కెగురజాలదు కదా! స్వదేశాభిమానము లేనివాడు మనుష్యనామమునకు అర్హుడు కాడు. యథార్ధమగు స్వదేశాభిమానము హృదయమును విశాలపరుపవలయును. అట్లు గాక హృదయమును సంకుచితముగను కఠినముగను చేసిన స్వదేశాభిమానము ఒక ధర్మము గాక, అధర్మహేతు వని గ్రహింపవలయును. కావుననే అట్టి బూటకపు దేశాభిమానమునకు గెటి ప్రోద్బల మియ్యక పోయెను. కాని ఆయనకు నిజమగు దేశాభిమానము లేకపోలేదు. జర్మనియొక్క ఉత్కృష్టదశయందును, జర్మనీదేశస్థుల యొక్క ఆధిక్యమునందును ఆయనకు ప్రేమపూరిత

మగు ఆశ కలదు. "The Germans' mission is to become the representative of all the world's citizens" అని ఆయన గర్వముతో నుడి వెను. వ్యక్తిని పునాదిగ జేసికొని ఆదర్శసంఘమును, జాతిని పునాదిగ జేసికొని విశ్వజనీన భ్రాతృమండలిని నిర్మింపవలె నని గెటి మహాశయునియొక్క ఆశయము.

## 5

గెటియొక్క సిద్ధాంతములలో ఆత్మగౌరవమునకు విశేషప్రాముఖ్యము కలదని చెప్పితిని. అదియే ఆతని మతముయొక్క మూలసూత్రము. ఏ మతము ఆత్మ గౌరవమును ప్రబోధించుచున్నదో, అదియే ఉత్కృష్ట మత మని ఆతని విశ్వాసము. ఆత్మగౌరవము పరనింద మీాద నిర్మింపబడునది కాదు. సర్వపదార్థములయెడ గౌరవము, ఆత్మగౌరవముమీాదనే ఆధారపడియున్నది. మనకంటె ఉన్నతమగు వాని యెడల గౌరవము, మన చుట్టునుండు వానియెడల గౌరవము, మనకంటె హీన మగు వానియెడల గౌరవము, అన్నియు ఆత్మగౌరవము ననుసరించియే యుండును. ఈ ఆత్మగౌరవము మాన

వుడు ఈశ్వరాంశసంభూతు డను సత్యముమీాద స్థాపింప బడినది. ఆత్మగౌరవ మన, మనఆత్మకు అంతరాత్మయగు పరమాత్మను గౌరవించుటయే. ఆతడు మన ఆత్మకు ఎట్లు అంతరాత్మయో, అట్లే సమస్తపదార్థములకును ఆత్మయై విరాజిల్లుచున్నాడు. కావున ఆత్మగౌరవము సమస్తపదార్థములను గౌరవించుటకు మనలను పురి కొల్పును. ఆత్మగౌరవ మన, సర్వాంతర్యామియు సర్వాత్మకుడును అగు పరబ్రహ్మమును గౌరవించుటయే. అట్టి గౌరవముమీాదనే మతమును స్థాపింపవలయునని గెటీయభిప్రాయము.

జీవితముయొక్క ఉత్కృష్టతయు పవిత్రతయు, వ్యక్తి యొక్క విలువయు ప్రాముఖ్యమును, కార్యనిర్వహణము యొక్క ఉపయోగమును ఆవశ్యకమును, తన యద్భుత మేధాశక్తి యంతయు వినియోగించి నిరూపించి భావ ప్రపంచమును గెటి తీరని కృతజ్ఞతయందు విడిచి వెళ్లెను. ఆతడు పరమపదించి యిప్పటికి ఒక శతాబ్ద మయినను నిర్మలమును, చాంచల్యరహితమును, శాంతి శోభితమును, ఆదర్శబద్ధము నగు ఆతని జీవితము ధ్రువ నక్షత్రమువలె భావనాకాశమున నేడును హృదయా కర్షకముగ దేదీప్యమానముగ ప్రజ్వరిల్లు చున్నది.

# మాజిని

"As a prophet he stands unrivalled in the nineteenth century, and his code of ethics is perhaps the noblest which has applied itself to the problems of modern life."

F. A. KIRKPATRICK.

కేవలము మత విషయములయందు శ్రద్ధ కలిగి మతాభివృద్ధికై విశేషముగ పనిచేసి జీవితమును ధన్యము చేసికొని కొందరు మహానుభావులు పవిత్రజీవు లయి అనేకుల హృదయములందు మతాభిమానము, ఈశ్వర భక్తి పురికొల్పి మృతజీవు లయి యున్నారు. మరికొం దరు రాజకీయ విషయములందే తమ యావచ్ఛక్తియు వినియోగించి తమ దేశీయులకు రాజకీయ విషయము లందును భౌతికజీవనమందును అనేక సౌలభ్యములు ఆనుకూల్యములు ఒనగూర్చుటకయి కృషి సలిపి తమ దేశీయుల కృతజ్ఞతకు పాత్రులయి యున్నారు. ఇంకను కొందరు సారస్వతమందు అభిరుచి కలిగి హృద్యమ మగు తమ కావ్యములచేతను, వ్యాసములచేతను, విమర్శన ములచేతను జీవితమును మాధుర్యవంతముగ జేయు చున్నారు. కాని తమ జీవనమంతయు ఈశ్వరభక్తి తోను మతాభిలాషతోను ప్రేమతోను నింపి తాము

చేయు ప్రతికార్యమును ఈశ్వరసేవగా పరిగణించి, తాము తలంచు ప్రతిభావమును ఈశ్వరోపాసనగా నెంచి, ప్రతివస్తువును ప్రతికార్యమును పవిత్రముగ జేసి, భౌతికజీవనమును స్వర్గీయజీవనముగ మార్చివేసి, మతమును యథార్థముగ జేసి, ప్రాపంచికరాజ్యమును ఈశ్వరరాజ్యముయొక్క ప్రతిబింబముగ జేయ కృషి సలుపునట్టి మహాపురుషుల సంఖ్య బహు స్వల్పముగ నుండును. అట్టి మహాపురుషులలో నొకడు మాజిని.

ఈతడు ఇటలీదేశస్థుడు. ప్రాపంచికచరిత్రయందు ఇటలీకి ఒక గౌరవస్థానము కలదు. ఇటలీకి ముఖ్యపట్టణమగు రోము ఒకప్పుడు ప్రపంచమునకు రాణి (Mistress of the world) అని ప్రఖ్యాతి గాంచెను. రాజకీయ విషయములందే కాక మత విషయములందును గూడ ఐరోపాకు రోము శాసన మిచ్చినది. క్రైస్తవమతమునకు రోము హృదయమయి కొన్ని వందల సంవత్సరములు మిక్కిలి శోభతో విరాజిల్లినది. కాని విధివశమున అంతయు తారుమారయినది. పాశ్చాత్యప్రపంచమంతయు నేలిన ఇటలి ఆస్ట్రియాకు లోబడి స్వాతంత్ర్యము కోలుపోయి దాస్యము సలుపవలసి వచ్చెను. మతము క్షీణించెను. ఐశ్వర్యము మంట గలసెను. మా

జినీ కాలపు ఇటలి మృతకళేబరమువలె నుండెను. శోభ లేదు. నీతి లేదు. ఆశ లేదు. జీవమె యున్నట్లు కనిపించ లేదు. దేశ మంతయు అంధకారముతోను అజ్ఞానము తోను ఆవరింపబడి యుండెను. జనులు స్వార్థపరు లయి అవినీతిపరు లయి నాస్తికు లయి ఉత్తమజీవనాభిలాష రహితు లయి జంతుసమానులుగ నుండిరి.

## 2

ఇది పందొమ్మిదవ శతాబ్దమునందు మాజినీ కాలపు ఇటలీయొక్క స్థితి. మాజిని తన దేశపు దుస్థితిని చూచి కడు పరితపించెను. ఆతని హృదయము బహు కోమలము. ఆతడు ఆరేండ్ల వాడయి యుండ నొక దిన ము తల్లితో షికారు వెళ్లుచుండెను. మార్గమధ్యమున నొక బిచ్చగానిని వా రెదుర్కొనిరి. ఆతడు వయసు మీరిన వృద్ధు డగుటచే వంగిపోయిన శరీరము కలవా డయి మిక్కిలి దీనముగ కనిపించెను. ఆ వృద్ధుని చూచి నతోడనే మాజిని ఒక నిమిషము నిశ్చేష్టుడై నిలుచుం డెను; పిమ్మట ఆతనిని సమీపించి కౌగిలించుకొని "అమ్మా! ఈ ముసలివానికి ఏమైన నిమ్ము" అని తల్లిని

వేడుకొనెను. ఈ పిల్లవాడు మెత్తని మనసుకలవాడు. ఈతడు జనసామాన్యమును ప్రేమించి వారికి మేలొనగూర్ప గలడు. ఇతనిని జాగరూకతతో పెంచుము, తల్లీ* అని యా ముదుసలి మాజినీ తల్లికి చెప్పి వెళ్లిపోయెను.

చిన్ననాటనుండియు మాజిని దీనజనబంధువు. ఆతడు చదువుకొనుచున్న కాలములో మిక్కిలి పొదుపు కలవాడయి మితవ్యయము చేయుచు తన డబ్బులో కొంత మిగిల్చి తోడివిద్యార్థులలో బీదవారికి నిచ్చుచుండెడివాడు. పుస్తకములు లేని వారికి ఆతడు తన పుస్తకములనే యిచ్చివేయును. కొన్ని సమయములందు తన దుస్తులను గూడ బీదబాలురకు నిచ్చువాడు. ఆతడు తన బాల్యమునందే ఇటలీ దేశముయొక్క దుస్థితి గ్రహించెను; బహు శోకించెను. శోకచిహ్నమగు నల్ల దుస్తులనే యెల్లప్పుడును ధరించుటకు నిశ్చయము చేసికొంటినని ఆతడు చెప్పెను.

దేశసేవ యన, గులాబి పుష్పముల పాన్పు కాదు. అందులో స్వేచ్ఛను గోల్పోయి పరాధీనములయిన దేశముల సేవ చేయుట యన, ముళ్లపొదల మీాదుగ నడచుటయే. అట్టి దేశసేవాతత్పరులు పొందు లాభము లేవి? ప్రజలచే అగౌరవింపబడుట. దొరతనమువారిచే చెర

సాలయం దుంచబడుట. దేశమునుండి రాజద్రోహిగను, దేశద్రోహిగను, వెడలగొట్టబడుట. ఉరితీయబడుటకూడ అరిది కాదు. ఇవియే స్వాతంత్ర్యమును గోల్పోయిన దేశస్థుల యథార్థమగు నిష్కళంకమగు దేశభక్తి యొక్క ప్రతిఫలములు. దేశభక్తుడు మాతృదేశము యొక్క క్షేమమునే దృష్టిపథమునం దుంచుకొని దేశసేవయే తన పరమవిధిగ నెంచుకొని జంకుగొంకులు లేక, ఈ ప్రతిఫలముల స్వీకరించుటకు సంసిద్ధుడుగ నుండును. అదియే నిష్కపటి యగు దేశభక్తుని లక్షణము. మాజిని అతిసుకుమారు డయ్యును కష్టముల లెక్కగొనక, తన విధినే లక్ష్యమునం దుంచుకొని మాతృదేశసేవకు పూనుకొనెను; కారాగృహమును దర్శించెను; ఇటలీ నుండి వెడల గొట్టబడెను. పాపము! తినుటకు తిండి లేక మలమల మాడవలసి వచ్చెను. కాని మాజిని ధైర్యశాలి. ఎన్ని యిడుములు సంప్రాప్తించినను, విశ్వాసమును ధైర్యమును ఆశను గోలుపోలేదు. ఇటలీనుండి వెడలగొట్టబడి నప్పుడు ఆతడు తల దాచుకొనుటకు స్వాతంత్ర్యమునకు జన్మభూమి యగు ఇంగ్లండుకు వెళ్లెను. అక్కడ కార్లయిలు మున్నగు ప్రముఖులు ఆతనికి ఆతిథ్య మిచ్చి ఇంగ్లండును రెండవ గృహముగ జేసిరి.

తన అంత్యదినమువరకును మాతృదేశసేవ చేయుచు ఆంగ్లవార్తాపత్రికలకు వ్యాసములు వ్రాసి పొట్ట పోసికొనుచు ఎట్లో కాలము గడపుచు 1872 వ సంవత్సరమున మాజిని కాలధర్మము నొందెను.

## 3

సామాన్యముగ రాజకీయ సంస్కర్తలు ప్రజల స్వామ్యములనుగురించియు హక్కులనుగురించియు ఆందోళనము చేయుట ఆచారమైయున్నది. కాని మాజిని హక్కులనుగురించి యెన్నడును మాటాడువాడు కాడు. ఎందువలన? జనులకు స్వామ్యములు లేవనియా? హక్కులు లేవనియా? లేక జనుల కష్టనిష్ఠురముల గ్రహింపక పోవుటవలననా? గ్రహించి వారి క్షేమమును మాజిని లక్ష్యము చేయక పోయెనా? కాదు. సామాన్యజనులయెడల మాజినీకి గల ప్రేమ అత్యద్భుతము. కాని, స్వామ్యములయొక్కయు హక్కులయొక్కయు తత్త్వము మాజిని గ్రహించెను. మన విధుల నెరవేర్చుటవలన కలిగిన హక్కులు తప్ప ప్రపంచమందు వేరేహక్కులు లేవని ఆయన విశ్వాసము.

"You have no rights, save as the consequence of duties fulfilled." అని ఆయన చెప్పెను. స్వామ్యములు హక్కులు ప్రాపంచిక సౌఖ్యములమీదను విషయభోగములమీదను ఆధారపడి యున్నవి. ప్రాపంచిక సుఖమే పరమావధిగ పెట్టుకొని హక్కులకొరకే పోరాటము సలిపిన యెడల, వైషయికనాగరికతకే ఎక్కువ ప్రాముఖ్యము నిచ్చినవారమయి నాస్తికులమయి పోవుదు మని మాజిని నుడివెను. దీనినిబట్టి మనము ప్రాపంచిక సుఖమును లక్ష్యము చేయక విరాగులు కావలె నని మాజినీ యుద్దేశముగ నెంచగూడదు. అందరు ధనికులుగ నుండవలసినదే; ప్రాపంచిక సుఖమును అనుభవింప వలసినదే; వైషయికనాగరికత పెంపొందింప వలసినదే. కాని, ఇవి జీవితముయొక్క పరమావధిగ నెంచబడక మానవుని ఉత్తమజీవనాభివృద్ధికిని ఆత్మౌన్నత్యమునకును సాధనభూతముగ నుండవలయు నని మాజిని చెప్పెను. కావున రాజకీయసాంఘిక సౌకర్యములు సంపాదించుట మన విధాయకమని యెంచి కృషి సలుపవలె నని ఆయన యుద్దేశము. మన రాజకీయ సాంఘిక జీవన మంతయు హక్కులమీద గాక విధులమీద నిర్మింపబడవలె నని ఆయన తెలిపెను.

## 4

దృష్టి హక్కుల మీఁదనుండి మరలించి విధులవైపు త్రిప్పబడిన తోడనే, రాజకీయ వ్యవహారములకు నూతనార్థము కలుగుచున్నది. రాజకీయ వ్యవహారములు కేవలము భౌతికము, వైషయికము అను అభిప్రాయమునకు తావు లేక పోవుచున్నది. విధి యనిన తోడనే ఈశ్వరుడు ధ్వనించుచున్నాడు. సర్వవిధులకు మూలము ఈశ్వరుడు. ఈశ్వరుడులేనిదే విధు లుండజాలవు. కావున రాజకీయ వ్యవహారములు విధులమీఁద ఆధారపడి యుండవలె నని మాజిని నుడివినప్పుడు యథార్థముగ మతము మీఁదనే ఆధారపడి యుండవలె నని ఆతని తాత్పర్యము. మతమునకును ప్రపంచమునకును భౌతిక జీవనమునకును ఎంతమాత్రమును విరోధము లేదు. ప్రపంచ మొక చెరసాల కాదు; మన పాపముల యొక్క ఫలితములన ననుభవించుటకు నేర్పరుపబడిన స్థానము కాదు. ప్రపంచము ఈశ్వరునిది. మన అభివృద్ధి నిమిత్తము మనము కృషి సలుపుటకుగాను మనల ఈశ్వరు డీ ప్రపంచమునం దుంచినాడు. కేవలము నివృత్తిమార్గ మవలంబించి ధ్యానములో మగ్నుల మయి

యుండుట ఈశ్వరోద్దేశము కానేరదు. మనము కర్మ యోగుల మయి యోధులవలె జీవింపవలసిన వారము. ప్రాపంచిక జీవనము భవిష్యజ్జీవనమునకు మనల తయారు చేయునట్టిదిగ నుండవలెను. ఈశ్వరప్రసాదితములగు ప్రాపంచిక సుఖములు పాపహేతువు లని చెప్పుట విపరీతము కాదా? మన విధి ఐహికసుఖముల ననుభవింపక పోవుటకాదు. వానిని మన నిజమగు అభివృద్ధికొరకును ఆత్మోపలబ్ధికొరకును వినియోగించుటయే మన కర్తవ్యము. శాశ్వతజీవనము పొందుటకు భౌతికజీవనము ఒక మెట్టుగా నుపయోగింపబడవలెను. ప్రపంచమునకును స్వర్గమునకును, ఐహికములకును ఆధ్యాత్మికములకును ఎట్టి పోరాటమును లేదు. కావున రాజకీయ వ్యవహారములు కేవలము ఐహికములును లౌకికములును అనియు, మతముతో గాని ఈశ్వరునితో గాని వానికి సంబంధము లేదనియు చెప్పుట గొప్ప పొరపాటని మాజిని బోధించి రాజకీయ జీవనము మతముమీాద నిర్మింప ప్రయత్నము చేసెను.

## 5

మాజినీకంటె స్వాతంత్ర్యమును ఎక్కువగ ప్రేమించు వారు మిక్కిలి అరిదిగ నుందురు. ఏల మాజిని స్వేచ్ఛను అంతగ ప్రేమించెను ? మాతృదేశముయొక్క వ్యాపారములు అభివృద్ధి పొంది దేశము ధనవంత మయి ప్రజలు విషయ సుఖముల బొందగలుగుదు రనియా ? స్వాతంత్ర్య మున్న, నిజముగ వ్యాపారములు అభివృద్ధి పొందును. ప్రజలు సుఖపడగలుగుదురు. ఇవి కోరబడ వలసిన శుభములే. కాని కేవల మీ ఐహిక సుఖముల కొరకు కాదు, మాజిని స్వాతంత్ర్యమును అభిలషించి నది. ఈ ఐహిక సుఖములకు యథార్థమగు విలువ లేదు. ఆధ్యాత్మికసుఖములకు ఐహికసుఖములు అవసర మని మాజిని భావించి వీనికొరకు కృషి సలిపెను. పరాధీనులగు మనుష్యులకు ఈశ్వరుని గ్రహించుట గాని, ఆయనను ఉపాసించుట గాని, ఆయన ధర్మమును అనుష్ఠించుట గాని దుర్లభ మని ఆయన తెలిసికొని స్వాతంత్ర్యముయొక్క విలువ గుర్తించి తన దేశమునకు స్వాతంత్ర్యము సంపాదించుట కయి తన ప్రాణమును ధారపోసెను. రాజకీయసంస్కర్తలు ఈశ్వరునియందు

విశ్వాస ముంచి ప్రజల ఆధ్యాత్మికాభివృద్ధి లక్ష్యమునం దుంచుకొని రాజకీయ జీవనము విధులమీద నాధారపడి యుండునటుల చేయవలయు నని ఆయన ప్రబోధించెను.

## 6

ఆ విధు లేవి ?

మొట్ట మొదటిదియు మానవజన్మమును సార్థకము జేయునట్టిదియు ఈశ్వరరాజ్యము భూమిమీద స్థాపించు టకు సాధనభూతమగు నట్టిదియు నగు విధి మానవకోటి యొక్క క్షేమముకొరకును అభివృద్ధికొరకును పాటుపడు టయి యున్నదని మాజిని చెప్పెను. ఈ బ్రహ్మాండము నకు అధిపతియగు ఈశ్వరుడు "ఏకమేవాద్వితీయమ్" అని విశ్వసించిన వారెల్లరు మానవకోటి యొక్కటియే అనియు, మానవు లందరును ఆయన సంతాన మనియు నమ్ముదురు. పరమేశ్వరుడు లోకనాథు డగుటయే కాక విశ్వపితయు గూడ నయి యున్నాడు. ఈశ్వరునియందు భక్తి గలిగి మానవునియందు ప్రేమ లేక యుండుట అసంభవము. మానవుని ప్రేమింపక ఈశ్వరుని ప్రేమించు నటుల నగపడు వారు కపటవేషధారు లని నమ్మవచ్చు

ను. ప్రతిమనుష్యుడును విశ్వమానవకుటుంబమునందు ఒక వ్యక్తియై యున్నాడు. ఈశ్వరుడే ఆ కుటుంబమునకు అధిపతి. ఆయనయందు భక్త్యనురాగములు కలిగి ఆతని కుటుంబముయొక్క క్షేమముకొరకును అభివృద్ధికొరకును పాటుపడుట ప్రతిస్త్రీకిని ప్రతిపురుషునికిని విధాయకకర్తవ్యము.

ఆ కుటుంబముయొక్క క్షేమము మీదనే, జ్ఞానాభివృద్ధి మీదనే, నీతిప్రవర్తన మీదనే ప్రతివ్యక్తియొక్క క్షేమమును శారీరకమానసిక ఆరోగ్యమును ఆత్మాభివృద్ధియును ఆధారపడి యున్నవి. మన జీవనము మానవకోటియొక్క జీవనముతో ఐక్యమయి యున్నది. జాతులకును జాతులకును ఏయే భేదములున్నను యథార్థముగ ముఖ్యమయిన విషయములలో అందరును ఒక్కటియే. దేహముయొక్క రంగు వేరుకావచ్చును; మాటాడు భాష వేరు కావచ్చును; ఆచరించు ఆచారవ్యవహారములు వేరు కావచ్చును. కాని వారి నాళములందు ప్రవహించు రక్త మొక్కటియే; వారి కన్నులవెంట కారు అశ్రువు లొక్కటియే; వారి హృదయముల ప్రజ్వలింపజేయు ఆశాజ్యోతి యొక్కటియే. మానవకోటిని ప్రేమింపవలయును. మనము చేయు ప్రతికార్యమును

మానవకోటియొక్క క్షేమమునకును అభివృద్ధికిని సాహాయ్యకరముగ నుండవలయును. ఏ కార్య మయినను మన కుటుంబములకును మన దేశమునకును లాభకరముగ నున్నను, మానవకోటికి హానికరముగ నున్న యెడల, పాప కార్యముగ పరిగణింపబడవలసిన దే. సర్వజాతుల సౌభ్రాతృత్వము నవయుగధర్మ మని మాజిని ప్రబోధించెను.

## 7

కాని, మానవకోటి కడు విశాల మయినది. మన మో అల్పజ్ఞులము, అల్పశక్తులము. మన మేవిధమున మానవ కోటి కొరకు పాటుపడ గలము; మన అల్పజ్ఞతయు బలహీనతయు దయాళుడగు ఈశ్వరుడు జ్ఞప్తియం దుంచుకొని మనకు దేశముల ప్రసాదించినాడు; మనల జాతులుగ విభజించినాడు. విశ్వమానవకోటిలో జాతులు వ్యక్తు లని మాజిని చెప్పెను. ప్రతిదేశమునకును ఒక్కొక్క స్వరూపము కలదు. ప్రతిజాతికిని ఒక్కొక్క వికాసము కలదు. ప్రతిదేశమును తన నిజ స్వరూప మును పొందవలయు నన్న, ప్రతిజాతియొక్కయు నంత ర్గర్భితమగు తేజస్సు బహిర్గతము కావలయు నన్న, ఆ

దేశమునకు, ఆ జాతికి స్వాతంత్ర్య ముండి తీరవలయును. స్వాతంత్ర్యము కోల్పోయిన జాతి ఆత్మోపలబ్ధి పొంద నేరదు; విశ్వమానవకోటియొక్క తేజఃప్రజ్వాలనమునకు రవ్వంత యైనను సహాయభూతముగ నుండ నేరదు. ఎప్పుడు ప్రతి దేశమును సర్వాంగోన్నత్యము కలిగి నిజ స్వరూపమును దాల్చుచున్నదో, ఎప్పుడు ప్రతిజాతియు ఆత్మోపలబ్ధి బొంది వికాసము చెందుచున్నదో, అప్పుడు విశ్వమానవకోటి సుందరస్వరూపము దాల్చి అద్భుత కాంతితో మనోహరమగు తేజస్సుతో ప్రజ్వలించును. స్వదేశమే ఈశ్వరప్రసాదితమగు మన గృహము, మన కార్యక్షేత్రము. దేశగృహమునం దందరును సమానులు. స్వార్థమును వీడి కృత్రిమము నావల నుంచి హృదయ పూర్వకముగా స్వదేశమును ప్రేమించి స్వదేశస్థులందరు మన సోదరు లని యెంచి వారి అభివృద్ధికొరకు పాటు పడుట మన రెండవ విధి యని మాజిని చెప్పెను.

## 8

విశ్వమానవకోటికి దేశ మెట్లో, దేశమునకు కుటుంబ మట్లు. కుటుంబము హృదయముయొక్క దేశ మని

మాజిని నిర్వచించెను. కుటుంబమును అంతకంతకు పవిత్రముగ జేసి దేశమునకు బంధించుట మన విధాయక కృత్య మని ఆయన బోధించెను. అధికనాగరికత చెందినవనుకొను పాశ్చాత్యదేశములందు కూడ పురుషుడు తన స్వార్థపరత్వముచేత కుటుంబమును అపవిత్రముగ జేసెననియు, స్వార్థపరత్వము వీడి న్యాయదృష్టి గలవాడై తిరిగి కుటుంబమును పవిత్రముగ జేసిననే కాని ఏ దేశమునకును మోక్షము లేదనియు మాజిని తలంచెను. కుటుంబమందు అన్యాయ్య మున్నయెడల, దేశమునందు న్యాయ్య మెట్లుండును? కుటుంబమునందు దాస్యమున్నయెడల, దేశమునందు స్వాతంత్ర్య మెట్లుండును? కుటుంబము అపవిత్రముగ నున్నయెడల, దేశమునందు ధర్మ మెట్లుండును? కుటుంబముయొక్క క్షేమాభివృద్ధుల మీదనే దేశముయొక్క క్షేమాభివృద్ధులు నిలిచియున్నవనుట నిశ్చయము.

కుటుంబ మేల అపవిత్ర మయినది? స్వార్థపరత్వమెక్కడ నున్నది? గృహలక్ష్మి యగు స్త్రీయొక్క స్వేచ్ఛను అడుగంట చేయుటలో పురుషుని స్వార్థపరత్వము బయల్పడినది. గృహదేవత యగు స్త్రీ అగౌరవముగ చూడబడుటవలన, కుటుంబము అపవిత్ర మయి

నది. పురుషుడు స్త్రీకంటె నధికు డనుకొనుట కేవలము పొరపాటు. అం దేమాత్రమును సత్యములేదు. మానవ కుటుంబమును రెండు తెగలుగ విభజించి ఒక తెగను రెండవ తెగకు దాస్యము సలుపునట్లు చేయుట అన్యాయ్యము. విశ్వపిత యగు ఈశ్వరుని యెదుట స్త్రీపురుషులు సమానులు. స్త్రీపురుషులకు కొన్ని విషయములలో భేదములు గల వనుట సత్యమే; కాని భేదము అసమానత్వము నిరూపింపదు. పురుషులకును పురుషులకును భేదములు లేవా? జాతులకును జాతులకును భేదములు లేవా? అంత మాత్రమున ఒక జాతివారు మరియొక జాతివారికంటె అధికు లని వారిమీద అధికారము చలాయించుట ధర్మమని చెప్పుటకు ధర్మబుద్ధి గలవా రెవరయిన సాహసింతురా? స్త్రీ పురుషునికి ప్రతివిషయమునందును సహకారిణిగ నుండవలెను. పురుషుని సుఖదుఃఖము లనుభవించుట యందే కాక, ఆతని ఆశయములందును యత్నములందును కృషుల యందును స్త్రీ పురుషునికి తోడ్పడు నట్లుండవలెను. ఆమె ఆతనికి ధైర్య మిచ్చునదిగా నుండవలెను; ఆతని శక్తుల నన్నిటిని ప్రేరేపించు నట్టిదిగ నుండవలెను. గృహలక్ష్మియు విశ్వమానవకోటికి మాతయు నగు స్త్రీకి

పురుషునితో సమానత్వము లేదని ఆమె స్వాతంత్ర్యము నిర్మూలము చేసి ఆమెను దాస్యమునను అంధకారమునను ఉంచుట మహాపాపము. ప్రతిజాతియొక్క యథార్థ స్వాతంత్ర్యము ఆ జాతియందలి స్త్రీల స్వాతంత్ర్యము మీదనే ఆధారపడి యున్న దని మనము నమ్మవలెను. స్త్రీకి సాంఘిక రాజకీయ జీవనమందు సమానత్వ మిచ్చి ఆమెను గౌరవించి గృహమును పరిశుద్ధముగను పవిత్ర ముగను చేయుట ప్రతిపురుషునియొక్క విధి యని మాజిని నుడివెను.

## 9

ఈ విధముగా విధులను పునాదిగ జేసికొని సాంఘిక రాజకీయ జీవనమును నిర్మాణము చేయవలయు నని మాజిని తన వ్యాసములందును పుస్తకములందును రమ్యమగు శైలిలో బోధించెను. ఈ క్రింది వాక్యములు ఆతని ముఖ్యసిద్ధాంతమును, ఆతనికి ఈశ్వరునియందు గల విశ్వాసమును తెలుపు చున్నవి:

"We believe that to make politics an *art* and sever them from morality, as the

royal statesmen and diplmaotists desire, is a sin before God and destructive to the peoples............I tell you with profound conviction, that without God, without belief in a Law, without morality, without the power of self-sacrifice, and by straying from the right path in the wake of men who have neither faith, nor worship of truth............you will never succeed."

"రాజనీతిజ్ఞులు కోరునట్లు రాజకీయవిషయములను ఒక ప్రత్యేక కళగా జేసి వానిని నీతికి దూరముగ జేయుట ఈశ్వరుని యెదుట నొక మహాపాప మనియు ప్రజలకు వినాశహేతు వనియు మేము నమ్ముచున్నాము. ఈశ్వరుడు లేనిదే, ఆయన శాసనమునందు విశ్వాసము లేనిదే, నీతి లేనిదే, స్వార్థత్యాగము చేయుశక్తి లేనిదే, విశ్వాసము గాని సత్యారాధన గాని లేని మనుష్యుల చేత నడపబడి ధర్మపథమునుండి తొలగుటవలన మీ రెప్పుడును జయము గాంచలే రని నేను దృఢవిశ్వాస ముతో చెప్పుచున్నాను."

రాజకార్యములను ధర్మమార్గమునకు ద్రిప్పి ఒక నూతనవిధానమును నవధర్మమును ఉపపాదించి మాజినీ మహాత్ముడు పాశ్చాత్యభావప్రపంచమునకు ఒక నూతన

వికాసమును నవతరశోభను కలిగింప జేసెను. రాజకీయ విషయములందు ఒక క్రొత్త శకము ఆతనితో ప్రారంభమయిన దనిన అతిశయోక్తి కాదు. ఆతనిని గురించి కార్లయిలు ఇట్లని చెప్పెను: “I can with great freedom testify that he......is a man of genius and virtue, one of those rare man... ......who are worthy to be called martyr souls; who in silence, piously in their daily life, practise what is meant by it.”

# రినాను

"To give Renan a monument is to erect one to Science and wisdom."

ANATOLE FRANCE.

సత్యము అమోఘ మైనది. సత్యమును మించిన మతము లేదు. సత్యమునకు మించిన ధర్మము లేదు. సత్యమునకు మించిన ఆదర్శము లేదు. సత్యము పరబ్రహ్మస్వరూపము. కావుననే ఋషులు 'సత్యాన్న ప్రమదితవ్యం' అని చెప్పిరి. సత్యమునుండి విడివడ వద్దు. ధనము పోనిమ్ము! ధాన్యము పోనిమ్ము! సర్వ సంపదలును పోనిమ్ము! రాజ్యము పోనిమ్ము! మతము పోనిమ్ము! తుదకు ప్రాణము సహితము పోనిమ్ము! సత్యమునుండి మాత్ర మెన్నడును విడివడ వద్దు. ఎవరు సత్యము నాశ్రయించుచున్నారో, వారు ఈశ్వరుని ఆశ్రయించుచున్నారు. ఎవరు సత్యమునుండి విడివడు చున్నారో, వారు ఈశ్వరవిముఖు లగుచున్నారు. ఎవరు సత్యముకొరకు మానావమానముల తలపక, నిందాప నిందల సరకుగొనక, కీర్త్యపకీర్తుల లక్ష్యము చేయక, భాగ్యభోగ్యముల మది నెంచక, ధైర్యముతోను విశ్వాస

ముతోను పోరాడుచున్నారో, వారేనిజమగు యోధులు. ఎవరు సత్యముకొరకు అష్టకష్టముల ననుభవించు చున్నారో, వారు ధన్యులు. ఎవరు సత్యముకొరకు హింసింపబడుచున్నారో, వారు ధన్యులు. ఎవరు సత్యము నుండి విడివడక, సత్యమునే యెల్లపుడు ఆశ్రయించు చున్నారో, వారు ధన్యులు.

రినాను ధన్యుడు. నాస్తికు డనియును దుర్మార్గు డని యును ఎవ రెన్ని విధముల నాతనిని నిందించిన నేమి? రినాను ధన్యపురుషుడు. సత్యమునందు చలింపని విశ్వాసము గలవాడు. సత్యమే మతముగా గలిగిన ధర్మవర్తనుడు. సత్యమును ప్రకటించుటయే తన విధిగా నెంచి తన అసామాన్యమగు పాండిత్య మంతయు తన అద్భుతమగు మేధాశక్తి యంతయు తన జీవితకాల మంతయు సత్యమును ప్రకటించుటయందే వినియోగించిన పుణ్యాచరితుడు. రినాను నందు ఒక విశేషము కలదు. ఎప్పుడును సత్యమును వచించుటయే కాక, తనకు తెలిసిన సత్యము నంతను ప్రకటించుట తనవిధి యని నమ్మి, తాను సత్య మని విశ్వసించిన దానిని ధైర్యముతో వెల్లడించెను. అదియే గదా పండితుల విధి. ప్రపంచమందలి మహాపవిత్రమయిన మతము అసత్యము

లచే నింపబడినపుడు, అజ్ఞానముచే పోషింపబడి నపుడు, అన్యాయ్యముచే వ్యాపింపబడి అపవిత్రముగ చేయబడి నపుడు, సత్యమును గ్రహించిన బుద్ధిమంతుల విధి యేమి? సత్యమును వెల్లడించి ధర్మమును రక్షించుటయే కదా! మనము గ్రహించు ప్రతి సత్యమును దానితో గూడ నొక గొప్ప బాధ్యతను తీసికొని వచ్చుచున్నది. ఆ బాధ్యతను గుర్తింపక సత్యమును ఎవరు మరుగుపరచు చున్నారో, వారు సత్యము నెడలను సత్యస్వరూపుడగు ఈశ్వరుని యెడలను మహాపాపము చేసినవా రగు చున్నారు. రినాను తన బాధ్యతను గుర్తించి తన విధిని నెరవేర్చుట యందు ఎన్ని కష్టములకు లోనుకావలసి వచ్చినను, సత్యమునందు విశ్వాసము కలవాడై తన జీవితాంతమువరకును సత్యమును ప్రకటించుచునే యుండెను.

## 2

రినాను ఫ్రాన్సు దేశస్థుడు. ఫ్రెంచిభాషయం దాతనికి అసమానప్రజ్ఞ కలదు. ఒక ఫ్రెంచిభాషయందే గాక అనేక భాషలం దాతడు నేర్పరి. క్రైస్తవ చర్చి యం దాచార్యపదవి సంపాదించి క్రైస్తవధర్మమును

బోధించవలె నని ఆతడు తలంచెను. కాని క్రైస్తవమత మును పరిశీలించిన కొలదిని, ఆ మతమునందాతనికి సంశ యములు ఎక్కువ కాజొచ్చెను. ధనసంపాదనముకంటె ధర్మపరిశీలనము ఎక్కువ అవసరముగ నాతనికి తోచెను. మానవజన్మముయొక్క సార్థకత ఐశ్వర్యజీవనమునందు కాక సత్యార్జనమునందు కలదని ఆతని దృఢవిశ్వాసము. అందువలన తన బుద్ధియు శక్తియు కాలమును జ్ఞానసంపా దనమునందే ఆతడు వినియోగించెను. ఆయన పఠించిన శాస్త్రములు వివిధములు. ఆయనచేసిన పరిశోధనలు పెక్కులు. ఆయన వ్రాసినటువంటి గ్రంథము లనేక ములు. పంతొమ్మిదవ శతాబ్దపు యూరపుఖండమునం దలి మహాపురుషులలో రినాను ఒకడు.

ఆతని గ్రంథము లన్నిటిలోను 'జీససుయొక్క చరిత్ర' (Vie de Jesus) మిక్కిలి ఉత్కృష్టమయిన దని చెప్ప వచ్చును. ఎట్లయినను విశేషవ్యాప్తి గలిగినటువంటి పుస్తక మదియే. ఆ గ్రంథము ప్రచురింపబడిన అయిదు మాసములలో పదునొకండు మారులు అచ్చొత్తింప బడినది; అరువదియారువేల ప్రతులు అమ్మబడినవి; అనే కభాషలలో భాషాంతరీకరింపబడినది. అది భావప్రపంచ మును తుపానువలె ముట్టడించినది. ఎక్కడ చూచినను

జీసుచరిత్రను గురించిన ముచ్చటలే! అక్కడక్కడ కొందరు రినానుయొక్క ప్రజ్ఞావిశేషమును భూషించు చుండిరి. కాని బహుజనులు నాస్తికు డనియు ఈశ్వర ద్రోహి యనియు నాతని దూషించుచుండిరి. నిర్మలతటాకమునందు ఒక పెద్ద రాయి పడవేసిన ఏవిధమున తటాకమంతయు నల్లకల్లోల మగునో, అదే విధమున పాశ్చాత్యభావప్రపంచ మంతయు జీసుచరిత్రచే నల్లకల్లోల పరుపబడియెను.

ఇంత కల్లోలమునకు కారణ మేమని పాఠకులు ఆశ్చర్యపడవచ్చును. జీసుక్రైస్తు దేవునియొక్క కుమారుడనియు దేవుడే యనియు విశ్వసించునట్టి క్రైస్తవసమాజమునందు ఆతడు మనుష్యమాత్రుడే యని ప్రకటించుటయే ఈ యల్లకల్లోలమునకు కారణము. క్రైస్తవులు రినాను సైతా ననియే భావించిరి; అంత పరమదుర్మార్గుడు మరియొకడు లేడని ఆతనిని తూలనాడిరి. ఒక క్రైస్తవస్త్రీ ప్రతిమాసమును రినానుకు "నరకము కలదు సుమా" అని ఒకే వాక్యము కలిగినటువంటి జాబును పంపుచుండెడిది. ఇదే విధమున అనేకు లాతనిని పరిహసించిరి, తూలనాడిరి.

కాని 'జీసు చరిత్ర' విశేషవ్యాప్తి చెందెను. క్రై

స్తవు లేమనినను, జీససునెడల రినాను చేసిన అపరాధ మేమియు కాన్పింపదు. రినానుయొక్క గ్రంథము చదివిన పిమ్మట, జీససునందు భక్తిగౌరవము లుండని వారరుదుగ నుందురు. ఆ శతాబ్దమునందు జీససును అర్థము చేసికొనినవాడు తా నొక్కడనే యని రినాను చెప్పుకొనెను. అందు కొంత అతిశయోక్తి యున్నను, అది చాల వరకు యథార్థ మని యొప్పుకొనక తప్పదు. క్రైస్తవుల మని చెప్పుకొను వారిలో చాలమందికంటె రినాను జీససును ఎక్కువ బాగుగా తెలిసికొనె నని నిశ్చయముగా చెప్పవచ్చును. జీససు ఈశ్వరుడు కాడనియు మనవలె మనుష్యమాత్రుడే యనియు చెప్పుటవలననే, మత పక్షపాతముచే అంధులు కాని వారికి రినానుగ్రంథము నందలి జీససు ఎక్కువ ప్రేమపాత్రు డగుచున్నాడు.

## 3

రినాను పుస్తకమునందు జీససుయొక్క చరిత్ర అతి రస వంతముగను, ఆనందదాయకముగను, భక్తిగౌరవములు పెంపొందునటులను, చక్కని శైలిలో వర్ణింపబడినది. జీససు దేవుడని నిరూపించుటకు ఆతనిచుట్టు చేర్ప

బడినటువంటి పురాణకథ లన్నియు త్రోసివేసి, ఆతని మతాభిప్రాయములు క్రమక్రమముగా నభివృద్ధిపొందుట చూపి, ప్రలోభనములచే ముట్టడింపబడి నపుడు ఆత డే విధమున వాని నెదుర్కొని జయశీలు డయినది యభి వర్ణించి, ఆతని చక్కని నడత మనోహరముగ రినాను ప్రదర్శించెను. ఈశ్వరపితృత్వమున, మానవసౌభ్రాతృ త్వమును జీసను గుర్తించినట్లు ఆతనికి పూర్వ మెవ్వరును గుర్తించి యుండలే దనియు రినాను ఆతనిని పొగడెను. ఈశ్వరరాజ్యము భూమిమీద స్థాపించుటయే తన పనిగా నెంచి తన సర్వస్వమును ఆ పనికొరకే జీసను ధారపో సెను. మానవు లందరిని దేవతలుగను, భూలోకమే స్వర్గరాజ్యముగను మార్పవలె నని జీసను కలవరించెను. "మీ తండ్రి యే విధముగ పరిపూర్ణుడుగ నున్నాడో, ఆ విధముగ పరిపూర్ణత్వము పొందుటకు మీరు ప్రయ త్నము చేయుడు. మీ శత్రువులను ప్రేమించి మిమ్ము బాధించు వారికొరకు ప్రార్థింపుడు" అని యాతడు బోధించెను. ఆతని బోధ యెంత మనోహరముగ నున్నను, ఆతని జీవితము అంతకంటె నెక్కువ మనోహరముగ నుండెనని రినాను చెప్పెను. స్వకుటుంబమును, ప్రాపం చికసుఖములను సంపూర్ణముగ నిర్లక్ష్యముచేసి ఈశ్వరుని

కొరకే, మానవసేవకొరకే జీససువలె జీవించిన వారు శాక్యముని తప్ప వేరెవ్వరును లేరని రినాను నుడివెను. మానవస్వభావములో పవిత్రమయిన దంతయు జీససులో మూర్తీభవించిన దనియు, ఆతనికంటె నుత్తమపురుషుడు మరెవ్వరును లేరని యుగములు ప్రకటించుచున్న వనియు రినాను ఘంటాపథముగ చెప్పెను. కాని అంతమాత్రమున జీసను దేవుడు కా డనియు, మనుష్యమాత్రుడే యనియు రినాను ఆతని మనుష్యత్వమునుగూర్చి నొక్కి చెప్పెను.

"He was not sinless; he conquered these same passions that we fight against; no angel of God comforted him save his own good conscience; no Satan tempted him save that which every man bears in his heart."

LIFE OF JESUS.

" అతడు పాపవిరహితుడు కాడు ; ఏ మనోవికారములతో మనము పోరాటము సలుపుచున్నామో, ఆ మనోవికారములను ఆతడు జయించెను. ఆతని నిష్కల్మషమగు అంతరాత్మ తప్ప ఏ దేవతయు ఆతనిని ఓదార్చ లేదు. ప్రతిమానవుని హృదయమునందు ఉన్నటువంటి సైతాను తప్ప వేరే ఏ సైతానును అతనిని ప్రలోభనములచే ఆకర్షింప ప్రయత్నము చేయలేదు."

## 4

ఈ విధముగా జీసను ఎంత ఉత్తమపురుషు డని వర్ణించినను ఆతనికి దేవత్వము ఆరోపించక పోవుట వలనను, క్రైస్తవమతము స్వాభావికమే గాని అందు ప్రకృతి నతిక్రమించిన విశేషము లేమియు లేవని వ్రాయుటవలనను అనేకులు రినానును నాస్తికుడని నిందించిరి; కొందరు భూషించిరి. కాని యథార్థముగ రినాను నాస్తికు డని చెప్పుటకు అవకాశము కాన్పించదు. ఏ మతము నందును ప్రకృతి నతిక్రమించిన విశేషము లుండజాల వని అతని వాదమయినను, మతమునం దాతనికి నమ్మకము లేకపోలేదు. మానవుని విజ్ఞాన మభివృద్ధి పొందినకొలదిని, నాగరికత హెచ్చినకొలదిని ఆతని మతాభిలాష కూడ వృద్ధిపొందునని రినాను స్పష్టముగ చెప్పెను. భక్తి మానవహృదయమునకు స్వాభావిక మనియు, భక్తియే మతముయొక్క సారమనియు, కావున మతము ప్రకృతివిరుద్ధము గాక ప్రకృతిసిద్ధ మనియు, నాగరికతాభివృద్ధి మతమును ధ్వంసముచేయక అభివృద్ధి పొందించు ననియు రినాను స్ఫుటముగ తెలిపెను. ఈ క్రింది వాక్యములనుబట్టి ఆతనికి మతమునందు విశ్వాసము కలదో లేదో పాఠకులే యూహించుకొనవచ్చును.

"Let us suppose a humanity ten times stronger than ours; that humanity would be infinitely more religious......Man would be transcendently religious, plunged in an eternal adoration, passing from ecstacy to ecstacy, being born, living, and dying in a torrent of rapturous delight......Progress, then, will have as its effect the augmentation of religion, not its destruction or diminution."

THE APOSTSLE

నాస్తికు డనియు, దుర్మార్గు డనియు, మత ధ్వంసకు డనియు, సైతా ననియు అపోహాల కల్పించి ఎవ రెన్ని విధముల నిందించినను సత్యమునే తన దృష్టిపథమునం దుంచుకొని, సత్యమును తెలిసికొనుటే తన పరమావధిగ నెంచుకొని, సత్యమును ప్రకటించుటే తన పరమవిధిగ భావించి, సత్యమును నిశ్చల భక్తితో ఆరాధించి, విజ్ఞానమును సంపాదించి, భావప్రపంచమునకు మహోపకార మొనరించి, తన జీవితమును సార్థకము చేసికొని రినాను ధన్యు డయ్యెను. ఆతని చరిత్రము సత్యాన్వేషకులకును వైజ్ఞానికులకును ఉత్సాహ జనకముగ నుండు నను టకు సందియము లేదు.

# టాల్ స్టాయి

"His work in religion as his work in imaginative literature is more than sufficient to signalise him as one of the most marking, interesting, and sympathy-inspiring men of our time."

MATTHEW ARNOLD.

రష్యా దేశము పూర్వము అభివృద్ధి మార్గమున నెంత నింపాదిగ నడచుచుండెడిదో, ఇప్పు డంత త్వరితముగ పరుగులిడుచున్నది. రాజకీయ విషయములం దేమి, సాంఘిక సంస్థాపనలయం దేమి, ఆర్థికస్థితులయం దేమి, మొత్తముమీద నవనాగరికతయందు రష్యా ప్రచండ వేగముతో పరివర్తనచెందుచు ప్రపంచముయొక్క దృష్టి నాకర్షించుచున్నది. అభినవభావముల సంఘాతముచే రష్యా దేశపు జీవనమునకు అద్భుతమగు సంచలనము కలిగి వెనుకబడియున్న దేశము ప్రతివిషయమునందు నిప్పుడు నూతనమార్గముల ద్రొక్కుచు ప్రపంచమునకు మార్గదర్శక మగుచున్నది. ఇప్పటికి సుమారు ఒక శతాబ్దమునుండి వచ్చుచున్న కవీశ్వరుల, తత్త్వవేత్తల పరంపరయే ఈ మార్పునకు, ఈ యుద్బోధమునకు

ముఖ్యకారణము. అట్టి ఉద్బోధకులలో టోల్‌స్టాయి అగ్రగణ్యు డని చెప్పవచ్చును.

టోల్‌స్టాయికి సారస్వతమం దభిరుచి మెండు. తన యిష్టానుసారముగ జీవించుచు తన రుచుల కనుగుణముగ సారస్వతమునందును, ఇతరకళలయందును కృషి సలుపుచు సుఖజీవనము గడపుటకు ఆతని పరిస్థితులు మిక్కిలి అనుకూలముగ నుండెను. ఆతడు సుమారు ఏబదివేల యెకరముల ఆస్తి గలిగిన గొప్ప భూస్వామి. కాబట్టి పొట్టకోసము పాటుపడ వలసిన అవసరము లేక పోవుటచే, తన కాలమును శక్తిని సారస్వతమునకే ఆతడు వినియోగపరచుచుండెడి వాడు. పందొమ్మిదవ శతాబ్దమున పాశ్చాత్యదేశములందు విశేషవ్యాప్తి చెందిన సారస్వతము నవలలరూపమున నుండెను. ఈ నవలలను వ్రాయుటయందు టోల్‌స్టాయికి గల నిపుణత వర్ణనాతీతము. జానపదులయొక్క జీవనమును, వారి శోకహర్షములును, వారి యాశయములును టోల్‌స్టాయి తన నవలలలో కడు రమ్యముగ చిత్రించెను. పాత్రపోషణమునందును, పాత్రవిస్తారతయందును ఆతనికి గల కౌశల్యము అసమానము. ఆతడు పద్యముల వ్రాయక పోయినను, నిజముగ కవీశ్వరు డని చెప్పవచ్చును. కవికి

ఉండవలసిన భావనాశక్తి, దర్శనశక్తి, కల్పనాసామర్థ్యము, వాఙ్నైపుణత, ఇవి ఆయనకు విశేషముగ గలవు. కావుననే రష్యా దేశపు సారస్వతచరిత్రయందు ఆయన కొక ఉత్తమస్థానము కలదు. కావుననే ఆతడు తన నవలల మూలమున నాగరికపాశ్చాత్యుల దృష్టి రష్యా సారస్వతమువైపునకు త్రిప్ప గలిగెను. ఇప్పటికిని "శాంతి, విగ్రహము," "అన్నా కెరనీను" అను నాతని గ్రంథములు సారస్వతప్రపంచమునందు సజీవము లయి ప్రఖ్యాతిని గాంచి యున్నవి.

## 2

సర్వవిధములయిన సిరిసంపదలతో తులతూగుచుండెడి టోల్‌స్టాయి ప్రపంచ మియ్యగలిగిన సుఖముల నన్నిటిని అనుభవించెను. కాని ఆతని ఆత్మకు శాంతి లేకపోయెను. యథార్థమగు సుఖము లేకపోయెను, ప్రపంచ మంతయు ఆతనికి అంధకారావృతముగ కాన్పించెను. అనేక విధములగు సంశయములు ఆతని మనస్సును బాధింప జొచ్చెను. ఏదియును ఆతనికి ప్రయోజనకరముగ కాన్పించ లేదు. ధనమువలన ప్రయోజన

మేమి ? కీర్తివలన ప్రయోజన మేమి ? దారాపుత్రుల వలన ప్రయోజన మేమి ? "యేనాహం నామృతాస్యాం కిమహం తేన కుర్యాం ?" అని ఆనాడు మైత్రేయికి తోచినటులనే టోల్‌స్టాయికి కూడ తోచెను. "జీవితముయొక్క అర్థ మేమి ? నే నెవరను ? ఏల నే నిక్కడికి వచ్చితిని ? నేను చేయవలసిన కార్య మేది ?" అని టోల్‌స్టాయి తన్ను తాను ప్రశ్నించుకొన సాగెను. ఈ ప్రశ్నములు టోల్‌స్టాయిని మాత్రమే యెదుర్కొన లేదు. సృష్ట్యాదినుండి నేటివరకును మహాపురుషుల మనోద్వారముల కడ నివి నినాదము చేయుచునే యున్నవి. వీనిని సాధింప జేసిన ప్రయత్నముల ఫలములే మతములు, తత్త్వశాస్త్రములు. వీనిని సాధించుటకే ఋషులు సర్వసుఖముల నెడబాసి అరణ్యములందు తపోనిష్ఠులయిరి. వీనిని సాధించుటకే బుద్ధుడు తన రాజ్యమును, సంసారమును, సర్వమును విడనాడి భిక్షువయ్యెను. వీనిని సాధించుటకే టోల్‌స్టాయి కూడ భాగ్యభోగ్యముల పరిత్యజించి కష్టజీవి యయ్యెను.

## 3

జీవితముయొక్క అర్థ మేమి ? ఇది తెలిసికొనుటకు టోల్‌స్టాయి అనేక మతగ్రంథముల పరిశీలించెను ; వివిధములయిన సాధనప్రణాళికల నవలంబించెను. మానవ జీవితముయొక్క నిష్ఫలత్వము ఆతని మనస్సున బాగుగ నాటుకొనెను. మానవజీవితముయొక్క దుఃఖపరంపరలు ఆతనిని బాధింపజొచ్చెను. మృత్యుభావము ఆతని మనో వీధిని సంచారము చేయుచు ఆతనిని భయకంపితునిగ చేసెను. అంతకును అంత్యము మృత్యువే కదా ! తన కును, తాను ప్రేమించు నెల్లవారికిని అంత్యము మృత్యువే కదా ! అని ఆతడు పలుమారు చింతించు వాడు. జీవి తముయొక్క రహస్యము కనుగొనలేక ఆత్మహత్య చేసికొనుట మేలని ఆతడు విలపించు వాడు.

ఎవరును తప్పించుకొనలేనటువంటి మృత్యువు జీవి తము నంతను విషతుల్యముగ చేసె నని ఆతడు భావించి యితరు లే విధమున జీవితమును సహింపజాలిరో పరి శీలింపజొచ్చెను. యువకులును, మూర్ఖులును అజ్ఞానము చేత మృత్యుచింత లేక సుఖముగ జీవించుచుండిరి. కొందరు దుఃఖముల ననుభవింపజాలక ఆత్మహత్య చేసి

కొనుచుండిరి. కాని అనేకులు, ముఖ్యముగ కృషీవలులు జీవితమునందలి దుఃఖముల నన్నిటిని అనుభవించుచు, ఆత్మహత్యాచింతయే లేక, జీవితము మంచి దనియు, జీవితమునకు అర్థము కలదనియు భావించి జీవించుట టోల్‌స్టాయి చూచి వారి జీవితమునకు రహస్య మే మని యోచింప సాగెను.

తుదకు మతమే వారి జీవితములకు మూలసూత్ర మని ఆతడు గ్రహించెను. తమ కుటుంబముల పోషించు టకు విసుగు విరామము లేక ఎడతెగక పరిశ్రమ చేయ వలసిన వారయ్యు, కడు బీద లగుటచేత పలువిధములగు కష్టములకును దుఃఖములకును లోనుకావలసిన వారయ్యు, కృషీవలులు సంతృప్తి చెంది జీవితమును సహించుటే కాక ఆనందముతో గడపుటకు ముఖ్యహేతువు వారి మతమే యని ఆయన కనుగొనెను.

మత మనిన వారికి అచారమాత్రము కాదు; సంఘములో గౌరవము సంపాదించుటకు చేయు నటన కాదు; కేవలము మానసిక హేతుజ్ఞానమును తృప్తి పరచుటకు పన్నిన పద్ధతి కాదు; ప్రతిదినము నెడ తెగక చేయు పాపములు కొట్టుకొని పోవుటకు ఏర్పరుప బడిన ఉపశాంతి కాదు. వారికి మత మన యథార్థము;

మత మన సాక్షాత్కారము. అఖిలాండకోటిబ్రహ్మాండ నాయకు డగు పరమేశ్వరుని సత్యస్వరూపము దర్శించి, ఆయనయొక్క ఆజ్ఞలను శిరసావహించి నెరవేర్చుటే మానవజీవితముయొక్క పరమార్థ మని యెంచి, తుచ్ఛ మగు ఐహిక సుఖములందు ప్రమత్తు లయి కాలమెల్ల వృథా పుచ్చుటకు కాక, ఆయన యిచ్ఛలను నెర వేర్చుచు మన విధులను పాలించుచు ఆధ్యాత్మిక జ్ఞానా నందములయందు అభివృద్ధి పొందుటకుగాను మనకు జీవితములు ప్రసాదింపబడిన వని గుర్తించి, రష్యాదేశపు కృషీవలులు మతాభిలాషులై, ఈశ్వరాజ్ఞానువర్తులై, సంతోషముతో జీవితములు గడుపుచున్నా రని టాల్ స్టాయి భావించెను.

## 4

ఇట్లు మత మేవిధమున కృషీవలుల జీవితములను సంతోషకరముగను పవిత్రముగను చేయగలిగినది చూచి టాల్‌స్టాయి తన జీవితమును గూడ సుఖప్రదముగ చేసి కొనవలయు నని యిచ్చగించి మతావలంబకు డగుటకు నభిలషించి తన సాంఘికమతాచారముల కడు శ్రద్ధతో

ననుసరింప మొదలిడెను. విలువగలిగిన తన నాజూకు దుస్తుల నావల పారవైచి కృషీవలునివలె ముతకబట్టల ధరించెను; స్వకాయకష్టము చేయ ప్రారంభించెను; మాంసాహారమును వదలివేసి కాయకూరలనే తినుచుండెను. మోకాలిమీద నిలువబడి ప్రార్థించుచు దేహమును మతముకొరకు కష్టపెట్టుటయందు ఆత డొక విధమయిన వింతసంతోషమును కనుగొనెను. తన బుద్ధికి అసంభవములుగను అసత్యములుగను కాన్పించిన ఆచారములను నమ్మకములను గూడ అనుసరించుచు తన మనోగర్వము నణగ ద్రొక్కుటయందు గూడ ఆత డొక విపరీతమగు సంతోషమును కనుగొనెను. కాని అనేక వికృతాచారములకును, మూఢవిశ్వాసములకును శరణాలయమై, జీవహింసకును, నరవధకును, ఘోరమగు యుద్ధమునకును అనుజ్ఞ నిచ్చుటే కాక వానిని పవిత్రముగ గూడ నెంచునంతటి దౌర్భాగ్యస్థితియందున్న 'గ్రీకుచర్చి' యొక్క క్రైస్తవమతము ఏ మాత్రమును ఆతని బుద్ధిని తృప్తిపరుప లేకపోయెను. టోల్‌స్టాయి, పాపము, తన జ్ఞానమును బుద్ధిని అణగ ద్రొక్కుటకు ప్రయత్నము చేసెను. కాని మూఢవిశ్వాసములతో జ్ఞానమునకు కలిగిన ఆ సంఘర్షణమునందు, జ్ఞానము

సంపూర్ణముగ విజయము గాంచెను.

టోల్‌స్టాయి తనకు ప్రసాదింపబడిన ప్రకాశము నెడలను జ్ఞానము నెడలను విశ్వాసము కలిగి సత్యమునకు నియమబద్ధు డయి మూఢవిశ్వాసముల విసర్జించి సత్యారాధన చేయగలిగిన వాడగుటచేతనే, పాశ్చాత్యభావ ప్రపంచమున మహోన్నతపదవిని పొందియున్నాడు. అప్పుడు ఆచారమం దున్న క్రైస్తవమతసాంప్రదాయము ఆతని బుద్ధికి తృప్తికరముగ నుండనందున, టోల్‌స్టాయి దానిని విసర్జింపవలసివచ్చెను. సంఘము ఎవరినైనను క్షమించును గాని 'మతపరిత్యాగిని' క్షమింపజాలదు. టోల్‌స్టాయి బహిష్కరింప బడెను. సంఘము ఆతనిని అనేకవిధముల అగౌరవపరచెను. ఎందువలన ? తన బుద్ధికి అసత్యము లని తోచిన వానిని అనుసరించుటకు గాని అనుసరించు నట్లు నటించుటకు గాని టోల్‌స్టాయి ఒప్పుకొనక పోవుటవలననే కదా ! ధార్మిక జీవనము గడపుటకు ప్రయత్నము చేసినప్పుడెల్లను తన మిత్రులు తన్ను పరిహసించు వారనియు, జూదము నందును జారత్వమునందును త్రాగుడునందును తన కాలము వృథాపుచ్చుచున్నప్పుడు తాను మంచివాడనియే అందరును భావించు వారనియు టోల్‌స్టాయియే

చెప్పెను. కాని ప్రాపంచిక సుఖములు సుఖములు కావు; ప్రాపంచిక కష్టములు కష్టములు కావు. ఎవని అంతరాత్మ "సెబాస్, నీవు చేసినది మంచి పని" అని చెప్పునో వానికే యథార్థమగు శాంతి, యథార్థమగు ఆనందము. ఎవడు అంతరాత్మకు విరుద్ధముగ నడచుకొనుచున్నాడో, వాడు ఎన్ని ప్రాపంచికసుఖముల ననుభవింప ప్రయత్నము చేసినను, ఎట్టి సిరిసంపదలతో కూడుకొన్న వాడైనను యథార్థశాంతి పొందజాలడు. ఆత్మశాంతియే శాంతి; ఆత్మానందమే ఆనందము. తన జ్ఞానము ఏది సత్యమని నిరూపించినదో, తన అంతరాత్మ ఏది ధర్మమని బోధించినదో, అది టాల్‌స్టాయి కష్టనిష్ఠురముల గణన చేయక అవలంబించుటచేతనే, పరమశాంతిని పరమానందమును పొందగలిగెను.

## 5

సామాన్యముగ రష్యాదేశస్థులు క్రైస్తవమత మని విశ్వసించి అవలంబించు మతము టాల్‌స్టాయిని తృప్తిపరుప లేకపోయినదని చెప్పితిని. అప్పుడాతడు తిరిగి బైబిలును జాగ్రత్తతో చదువ నారంభించెను. ఆ పవిత్రగ్రం

థమును అనేకపర్యాయములు పఠించి జీసను కొండమీా దచేసిన ధర్మోపదేశము (Sermon on the mount) లో క్రైస్తవమతసారము కల దని ఆయన యూహిం చెను. ఈక్రింది సిద్ధాంతములు క్రైస్తవమత విశిష్టధర్మ ము లని ఆతడు నుడివెను.

1. "క్రోధమును చంపివేయుము. ఎవరియెడలను కోపము కలిగి యుండకుము." కారణము లేకుండ కోపింపకుము అని సామాన్యముగ బైబిలునందు వ్రాయ బడి యున్నది. కాని "కారణము లేకుండ" అను పద ములు జీసను చెప్ప లేదనియు, అది భాషాంతరీకరణము నందలి దోషమనియు టాల్‌స్టాయి నిరూపించెను. ప్రతి క్రోధికిని తాను కోపించునపుడు కారణ మున్నటులనే కాన్పించును ; నిజముగ అకారణముగ కోపించు వారు అరుదుగ నుందురు. ఎప్పుడును ఏ సందర్భములయందును కోపము చెందకుండ నుండవలయుననియే జీసనుయొక్క అభిప్రాయ మయియుండును.

2. " వ్యభిచరింపకుము. స్త్రీలను చెడ్డతలపుతో ఎవ రు చూచుచున్నారో, వారు హృదయమునం దప్పుడే వ్యభిచరించిరని గ్రహించి స్త్రీలయెడల చెడ్డతలపు లేకుండ చేసికొనుము. స్త్రీ ఒకే భర్తయు, పురుషుడు ఒకే భా

ర్యయు కలిగి యుండుట ధర్మము. వివాహవిచ్ఛేదము పాపము." సామాన్యముగ బైబిలునం దిట్లని యుండును :—"వ్యభిచారిణి అయి నప్పుడు తప్ప ఎవడు తన భార్యను వదలివేయుచున్నాడో వాడు ఆమెను వ్యభిచారమునకు పురికొల్పుచున్నాడు." కాని, "వ్యభిచారిణి అయినప్పుడు తప్ప" అను మాటలు మూలమునందు లేవనియు, భాషాంతరీకరణమునందు చేర్పబడిన వనియు, వివాహవిచ్ఛేదము వ్యభిచారమును వృద్ధిచేయును కాన అది ఎప్పుడును ఏ సందర్భములయందును గూడ ఆచరణీయము కాదనియు, అదియే జీసను ఉద్దేశమనియు టోల్‌స్టాయి చెప్పెను.

3. "ఎప్పుడును ఆన తీసికొనకుము." క్రోధమును చంపుము, వ్యభిచరింపకుము అను ఉపదేశముల తరువాత బోధింపబడిన ఈ యుపదేశము అత్యల్పవిషయముగ కాన్పించును. కాని దీని అర్థము బహు గభీరము. పాశ్చాత్యదేశములందు సేనలలో చేరుటకుముందు, ప్రతి మనుష్యుడును తన పైయధికారుల యిచ్ఛానువర్తనముగ నడచుకొందు నని ఆన తీసికొనవలయును. ఒకరు చెప్పినట్లు నడచుకొందు మని ఆన తీసికొనుట యన మన భవిష్యత్కార్యములమీద మన స్వాతంత్ర్యము కోల్పో

వుట. ఆన తీసికొనిన వారు తమ బుద్ధిని, తమ యిచ్ఛను, తమ అంతరాత్మను చంపి వేసికొనుచున్నారు. ఈశ్వరేచ్ఛ ననుసరించి నడచుకొనుట మన విధియనియు, ఈశ్వరేచ్ఛయు మానవేచ్ఛయు నెల్లప్పుడు నేకీభవించవనియు, కావున ఒకరియిచ్ఛ ననుసరించి ఎల్లప్పుడును నడచుకొందు మని ఆన తీసికొనుట అధర్మ మనియు జీసను బోధించె నని టాల్‌స్టాయి చెప్పెను.

4. "దౌర్జన్యమును దౌర్జన్యముచేత ఆటంకపరుపకుడు. ఎవరైన మీ కుడి చెంపమీద కొట్టినయెడల, వారికి మీ ఎడమ చెంప కూడ చూపుడు. "Resist not evil"— దౌర్జన్యమును ఆటంకపరుపకుడు—అను వాక్యమునకు అర్థము చెప్పుటలోనే టాల్‌స్టాయియొక్క బుద్ధిస్వాతంత్ర్యమును, నిష్కపటసత్యాన్వేషణాభిలాషయు తేటపడుచున్నవి. ఈ ఉపదేశమునందు గొప్ప భావమే యున్నను, జీవితమునందు దాని యాచరణము అసంభవ మనియు, అది అనుసరించుటకు ప్రయత్నము చేసినయెడల మన సంఘసంస్థాపనము నిర్మూలమగు ననియు క్రైస్తవులందరు నింతవరకు చెప్పుచుండిరి. కాని టాల్‌స్టాయి నిర్భయముగా, నిష్కపటముగా ఈ వాక్యమును అర్థము చేసికొని జీసను ఉపదేశమునందు

సంపూర్ణవిశ్వాసము కలిగినవా డగుటచేతను, యథార్థ జ్ఞానము కలవా డగుటచేతను క్రైస్తవసంఘము జీసను యొక్క ఉపదేశమునకును ధర్మమునకును భిన్నముగా నేర్పరుపబడిన దనియు, కావుననే దౌర్జన్యము ప్రపంచ మందు అంతరింపలే దనియు, ఎప్పుడు జీసను ఉపదేశిం చిన ధర్మమును జీవితమం దనుసరింతుమో, అప్పుడు దౌర్జన్యము రూపుమాయు ననియు, యుద్ధము తుద ముట్టు ననియు, ప్రపంచమందు శాంతి రాజ్యముచేయు ననియు, భూమి స్వర్గముగా మారి పోవుననియు చెప్పెను.

5. "జాతివివక్ష లేక అందరిని సమానముగ ప్రేమిం పుము. ఈశ్వరునికి సర్వజాతులును సమస్తమానవులును సమానులే. ఆత డందరిని సమానముగ ప్రేమించును. అట్లే మనుష్యులు జాతివివక్ష లేక అందరిని ప్రేమింప వలయును." "Love your enemies" అను వాక్యము నందు enemies అను పదము విదేశస్థుల తెలియ జేయుట కుపయోగింపబడినదనియు, సామాన్యవిరోధు లని కాదనియు, కావున దేశాభిమానము హృదయ మును సంకుచితపరుప నీయక, ప్రతిజాతివారిని సమాన ముగ ప్రేమింపవలయు ననియు, శత్రుత్వవినాశమే మత మనియు, విశ్వజనీనమగు ప్రేమయే క్రైస్తవమతమునకు

ప్రాణమును ఆత్మయును అయియున్న వనియు టాల్‌స్టాయి బోధించెను.

## 6

ఈ ఉపదేశపంచకమునందే మతముయొక్క సారమును, ఆనందముయొక్క రహస్యమును కల వని ఆతని దృఢవిశ్వాసము. మనుష్యులు కోపము లేక, పరిశుద్ధ హృదయము కలిగియుండి, దాస్యప్రతిజ్ఞ తీసికొనక, దౌర్జన్యము దౌర్జన్యముతో ఆటంకపరుప ప్రయత్నింపక, జాతివివక్షు లేక అందరిని సమానముగ ప్రేమించిన, శాంతిరాజ్యము భూమిమీద స్థాపితమగు నని ఆయన బోధించెను. ఇదియే జీసను సందేశముయొక్క సారాంశ మని ఆతడు నుడివెను. ఆతని వ్యాఖ్యానము, ఆతని భావములు అందరు అంగీకరింపక పోవచ్చును. నిజముగ ఏ గొప్ప మతముయొక్కయు సారమును, ఉత్కృష్టతయు కొన్ని ఉపదేశములలోను, నియమములలోను ఇముడ్చుటకు సాధ్యము కాదు. మన సంఘజీవనమునందు అది సృజించు వాతావరణమందును, మన హృదయములందు అది జనింపజేయు ఆశాజ్యోతియందును,

మన ఆత్మలయందు అది కలిగించు ఉద్బోధనమునందును మతముయొక్క గొప్పతనమును మనము గుర్తింపవల యును. కావున అందరును టోల్‌స్టాయి యొక్క వ్యా ఖ్యానమును ఒప్పుకొనక పోవచ్చును. కాని ఆతని భావ ములు స్వతంత్రము లయినవి, సజీవము లయినవి. అందు వలననే ఆతడు పాశ్చాత్యభావప్రపంచమునకు సంచల నము కలిగింప జేయగలిగెను. అహింసాధర్మమును ప్రతి పాదించి టోల్‌స్టాయి పాశ్చాత్యభావప్రపంచమున ఒక నూతనయుగమునకు కర్త యయ్యెను. ఈ విషయమున తాను టోల్‌స్టాయియొక్క శిష్యవర్గములో చేరినవాడ నని అహింసాప్రవక్త యనబడదగు గాంధి మహాత్ముడు చెప్పె ననిన, టోల్‌స్టాయియొక్క గొప్పతనమును మన ము ఊహించుకొన వచ్చును.

# ఇబ్సేను

"One of the most original and far-reaching imaginations Europe has seen for a century."

EDMUND GORSE.

పందొమ్మిదవ శతాబ్దమున పాశ్చాత్య దేశములలో నాటకసారస్వతచరిత్రమునం దగ్రస్థాన మాక్రమించుకొనిన ఇబ్సేను ఐరోపాలో నెల్ల అనాగరిక దేశ మనుకొనబడు నార్వేదేశమున పుట్టినవాడు. మనుష్యుని యిచ్ఛ యే విధమున తన త్రోవలోని ప్రతిబంధముల నెల్ల తన తీవ్రమగు శక్తిద్వారా రూపుమాపి జయప్రదముగా విరాజిల్ల గలదో చూడవలయు నన్న, ఇబ్సేనుని జీవనచరిత్ర దృష్టాంతము కాగలదు.

ఆయన రినానువలెనే కడుబీదకుటుంబమున జనించెను. తొడుగుకొనుటకు మేజోళ్లు కాని, లోపలిచొక్కాయలు కాని, చలినుండి కాపాడుటకు ఓవరుకోటు కాని, చదువుకొనుటకు పుస్తకములు కాని లేక, ఆతడు అనేకసంవత్సరములు గడపవలసి వచ్చెను. కాని ఇబ్సేనుయొక్క యిచ్ఛాశక్తి బహుతీవ్రమయినది. సామాన్యముగ చెడుగుగ నెంచబడు పేదరికము ఆతనికి ప్రచ్ఛన్నమయిన ఆశీర్వాద మయ్యెను.

నీరులేని చెరువునందు కప్ప లేవిధమున నుండవో, అదేవిధమున ధనములేని వానికడ మిత్రులు చేరరు. జీవిత యాత్రయందు ధనవిహీనుడు ఏకాంతముగ ప్రయాణము సలుపవలసి వచ్చును. ధనసాహాయ్యము కలవానికి అందరును సాహాయ్యము చేయుదురు ; కాని ధనములేని వానికి స్వయంసాహాయ్యమే గతి యగును. ఇబ్సెను ధనహీనుడగుటవలన మిత్రవిహీను డయి సాహాయ్యశూన్యుడయి కొండికనాటనుండియు ఒంటరిగ నిలువవలసిన వాడయ్యెను. ఇదియే ఈశ్వరుడు ఆతనికి చేసినమహోపకారము. బాల్యమునుండియు స్వయం సాహాయ్యము మీాద నే ఆధారపడి ఒంటరిగ నిలువబడుటకు నలవాటు పడియుండుట చేతనే, తరువాత నాతడు సాంఘిక దురాచారముల నిష్పక్షపాతబుద్ధితో ప్రకటించుటవలన, సంఘ మాతని కోపావేశముచే బహిష్కరించి నప్పుడు, ఇబ్సెను ధైర్యముతో ఒంటరిగ నిలువబడి అసత్యముతో భీకరయుద్ధము సలుపగలిగెను. ఆహా, ఈశ్వరవిధానము లతిచిత్రములుకదా !

ఇబ్సెనుయొక్క ధైర్యమును పట్టుదలయును ప్రశంసనీయములు. మొదట 'కాటిలీనా' (Catilina) అను నాటకము నాతడు ప్రచురించి నపుడు, ముప్పది ప్రతులకంటె నెక్కువ అమ్ముడు పోలేదు. కాని ఇబ్సెను నిరు

త్సాహము చెందక మిక్కిలి పట్టుదలతో పనిచేసి అనేక నాటకముల వ్రాసి తుదకు ఒక నార్వేయందే కాక ఐరోపాయ దంతటను అసమాన యశస్సును సంపాదించెను. ఒక్కొక్క నాటకముయొక్క మొదటి కూర్పు పదివేల ప్రతు లచ్చొత్తింపబడినను, కొద్దిదినములలోనే యవి ఎగ నెత్తుక పోబడెడివి. ఆతని చివరినాటకములలో నొకటగు 'హెడ్డాగేబ్లరు' (Hedda gabler) అనునది ఇంగ్లండు లోను, అమెరికాలోను, రష్యాలోను, జర్మనీలోను, బెలిజియములోను, నార్వేలోను, హాలెండులోను ఒక్కే పర్యాయము ప్రచురింపబడినదని తెలిసికొనిన నపుడు, ఇబ్సెనుయొక్క కీర్తి యెంతదూరము వ్యాపించినదియు మన ము గ్రహింపవచ్చును. బీదకుటుంబమున జనించిన ఇబ్సెను వృద్ధాప్యము చెందునప్పటికి, రాజులచే గౌరవింపబడు నంతటి యశస్సు తన నిరుపమానప్రజ్ఞచే సంపాదించెను.

## 2

నాటకసారస్వతమునందు ఇబ్సెను ఒక క్రొత్త మార్గము ద్రొక్కెను. సామాన్యముగ కవులు కావ్యసాంకేతికముల నతిక్రమించుటకు సాహసింపరు. కథావిషయములందును,

రచనావిధానమునందును వారు వెనుకటి పద్ధతినే అవలంబించుచుందురు. కాని ఇబ్సెను స్వతంత్రించి ఈ రెంటి యందును మార్పు ప్రవేశపెట్టెను. సంఘవిమర్శనము విషయముగా గైకొని వచనశైలితో నాటకములు వ్రాయుటకు ఇబ్సెను ప్రథముడు. ప్రాతపంథకు అలవాటు పడిన పాఠకబాహుళ్యమునకు మొదట ఈతని నాటకములు రుచింపకపోవుటలో ఆశ్చర్యమేమియు లేదు. ప్రతిస్వతంత్రకవియు మొదట వింతగనే జనులకు కాన్పించును. కాని క్రమక్రమముగ ఇబ్సెనుయొక్క నాటకముల స్వారస్యము పాఠకులు గ్రహింప గలిగిరి. ఇబ్సెనుయొక్క పద్ధతుల నితరకవులు అనుకరింప జొచ్చిరి.

పందొమ్మిదవ శతాబ్దపు పాశ్చాత్యసంఘవిమర్శనము ఇబ్సెను నాటకములలోని ముఖ్యవిషయము. వ్యక్తి స్వాతంత్ర్యము ఆ శతాబ్దపు ముఖ్యసిద్ధాంతములలో నొక్కటి. కార్లయిలు, ఎమర్సను, గెటి మొదలగు మహాపురుషులు తన వ్యక్తిత్వప్రకటనము ప్రతిమనుష్యునికి విధాయకకృత్య మని నొక్కి వక్కాణించి యుండిరి. అదే విధమున తన నాటకములలో ఇబ్సెను వ్యక్తిస్వాతంత్ర్యము యొక్కయు, వ్యక్తిత్వప్రకటనముయొక్కయు ఆవశ్యకతను నిరూపించెను.

ఆచారము నిరంకుశాధికారముతో ప్రపంచమును ఏలుచున్నది. రాజాధి రాజులును, పండితాగ్రేసరులును, నిరక్షరకుక్షులును, అందరును సమానముగ ఆచారమునకు దాస్యము సలుపుచున్నారు. ఆచారపిశాచము యథార్థముగ ఈశ్వరుని స్థాన మాక్రమించుకొనినది. సత్యమును ధర్మమును ఈ యాచారపిశాచమునకు బలిగా నియ్యబడుచున్నవి. కులక్రమాగత ధర్మమే ధర్మముగ పరిగణించి నూతనధర్మమును గ్రహింపలేక ధర్మమునం దభివృద్ధిలేక సంఘములు కడు దుస్థ్సితియం దున్నవి. అసత్యములు, అధర్మములు ఆచారముచే పవిత్రముగ చేయబడి మానవహృదయముల సంపూర్ణముగ తమవశము చేసికొనినవి. ఆచారపిశాచము సత్యమును రూపుమాపినది; ధర్మమును అంతరింపజేసినది; వ్యక్తిస్వాతంత్ర్యమును నిర్మూలము గావించినది; మానుషత్వమును అడుగంట జేసినది. సంఘమునందలి పురుషులందరు ధైర్యవిహీను లయి ముసలమ్మలవలె నగుటకు కారణము ఆచారదేవతను కొలుచుటయే. "జానపదుల యొక్క శత్రువు" (An Enemy of the People) అను నాటకమునందు "సంఘమంతయు రోగజనకమగు అసత్యముమీాద నాధారపడి యున్నది" అని డాక్టరు స్టాల్

మాను చెప్పిన వాక్యమునందలి భావము ఇబ్సెనుయొక్క అభిప్రాయముగ మనము ఊహింపవచ్చును. సత్యము, స్వాతంత్ర్యము అను గట్టి పునాదిమీద నిర్మింపబడుటకు మారు సంఘము అసత్యము మీదను కాపట్యముమీదను ఆధారపడియున్న దని ఇబ్సెను సంఘనిర్మాణమును ఖండించెను. "దయ్యములు" అను నాటకమునందు ఆల్వింగు దొరసానిచే ఇబ్సెను ఇట్లని చెప్పించెను.

"నిర్జీవములగు భావములును నమ్మకములును మనలో సంచారము చేయుచున్నవి. అవి శక్తివిహీనము లయినను, వాని బారినుండి మనము తప్పించుకొన లేకున్నాము. ఈ అనృతభావములయొక్కయు నమ్మకములయొక్కయు దయ్యములే దేశమునం దంతటను ఎక్కడ చూచినను, సముద్రమునం దిసుకవలె కాన్పించుచున్నవి. వెలుతురు చూచిన, మన మందరము భీతిల్లుచున్నాము."

ఈ దయ్యము నిజస్వరూపము చూపుటకే ఇబ్సెను తన నిరుపమానమగు నాటకముల రచించెను. ఈ దయ్యముల పారద్రోలిననే కాని, ఏ దేశమును యథార్థమగు అభివృద్ధిని పొందజాలదు. ఆచార మను మట్టిదేవతను బ్రద్దలుగొట్టి నూతనసత్యములను నూతనధర్మములను స్వీకరించిననే కాని, ఏ జాతియు అభివృద్ధి పొందనేరదు.

## 3

గృహములను స్త్రీలనుగురించి ఇబ్సెను చేసిన విమర్శనము కూడ వ్యక్తిస్వాతంత్ర్యముమీదనే ఆధారపడియున్నది. తమ గృహములు యథార్థగృహములు కాక బొమ్మరిళ్లని ఇబ్సెను చెప్పెను. స్త్రీలు మనుష్యులనియు, వికాసము బొందగల ఆత్మగల వారనియు మరచిపోయి వారిని బొమ్మలవలె చూచుటవలన, తమ గృహములు బొమ్మరిళ్లయినవి. పురుషునికొరకే స్త్రీ సృజింపబడినదనియు, పురుషుని సౌఖ్యముకొరకే, పురుషుని అభివృద్ధికొరకే తనయొక్క కాలమంతయు వినియోగించుట స్త్రీకి కర్తవ్యమనియు తలచి "బొమ్మరిల్లు" (A Doll's House) అను నాటకములో హెల్మరు చెప్పినట్లు 'ముఖ్యముగ ఆమె గృహిణియు మాతయు' ననియునెంచి ఆమె వ్యక్తిత్వమును నిర్మూలము చేయజూచిన స్వార్థపరుడగు పురుషుడు తాను త్రవ్వుకొనిన గోతిలో తానే పడి తన యిల్లు బొమ్మరిల్లుగ చేసికొనుటలో ఆశ్చర్యమే మున్నది? పురుషుడు కేవలము స్వార్థపరుడై స్త్రీని గృహమునందొక బొమ్మవలె నుంచెను. బహుశః స్త్రీ యెడ మిక్కిలి గౌరవము కలిగి ఒక పుష్పమువలె

నుంచెను కాబోలు! ఆమెమీాద సూర్యరశ్మి సోకిన, ఆమె దేహము కందిపోవును! ఆమె శరీరకష్టము చేసిన, సౌకుమార్యము కోల్పోవును! ఆమె విశేషముగ కష్టించి చదివిన, సౌందర్యమునకు ముప్పు వచ్చును! ఇట్లని తలచి ఆమె నొక బొమ్మగనో పుష్పముగనో ఎంచి పురుషు లామెకు జీవితమునందు, యథార్థకార్యమునందు, "సంఘస్తంభములు" (The Pillars of society) అను నాటకములో లోనా చెప్పినట్లు, జీవిత కార్యములో (life-work), ఏ మాత్రమును జోక్యము లేకుండ చేయుటవలననే, ఆమెను కేవలము 'గృహిణిగను మాతగను' ఎంచుటవలననే, ఆమె వ్యక్తిత్వమునకు తగినంత ప్రాముఖ్యము నియ్యక పోవుటవలననే వారి యిండ్లు బొమ్మరిండ్లయి పోయినవని ఇబ్సెను భావించెను.

స్త్రీయొక్క వ్యక్తిత్వము గుర్తించిననే కాని, ఆమె వ్యక్తివికాసమునకు తగిన విద్య నామెకు నిప్పించిననే కాని, బొమ్మరిండ్లు తిరిగి గృహములుగ మారవు. సత్యము సంచారము చేయుచున్నది. స్వాతంత్ర్యము స్త్రీల మనసుల నాకర్షించినది. స్త్రీల నిక నజ్ఞానాంధకారమున నుంచుట నెవరికిని శక్యము కాదు. 'బొమ్మరిల్లు' అను

నాటకములో నోరా* చెప్పినట్లు "అన్నిటికంటె ముఖ్యముగా నేను మానిసి ననుకొనుచున్నాను." అని నేడు ప్రపంచమందలి ప్రతి స్త్రీయు తలంచుచున్నది.

స్త్రీ యే విధమున పురుషుని ఆస్తి కాదో, అదే విధమున బిడ్డలును తల్లిదండ్రుల ఆస్తి కారు. బిడ్డలు తల్లిదండ్రుల ఆస్తియనియు, తల్లిదండ్రుల కార్యముల నెరవేర్చుటయే వారి కర్తవ్య మనియు, ఆ కార్యములకు భిన్నమగు కార్యముల—వారి అంతరాత్మ ఎట్లు బోధించినను—చేయ కుండుట యే వారి పరమవిధి యనియు సామాన్యముగ జనులు తలంతురు. బిడ్డలను పెంచు విధమంతయు నీ యసత్యభావముల ననుసరించియే యున్నది.

ఇదియు ఆచారదేవతయొక్క ప్రభావమే. అందువలననే నూతన సత్యములు నూతన ధర్మములు ప్రబలకున్నవి. అందువలననే సామాన్యముగ సంఘమునందు ధైర్యస్థైర్యములు కల తల్లిదండ్రులు కాని, ధైర్యసాహసములు కల బిడ్డలు కాని లేక అందరును శక్తివిహీనులగు ముసలమ్మలవలె నుండి అసత్యములకు దాసానుదాసు

* Helmer : Before all else you are a wife and a mother. Nora : That I no longer believe. I think that before all else I am a human being.

లయి మట్టిదేవత యగు ఆచారమును ఆరాధించు చున్నారు. ఈ విమర్శనము ముఖ్యముగా మన దేశము నకు వర్తించు నని చెప్పవచ్చును. "సంఘ స్తంభములు" అను నాటకములో తన కుమారునికి బర్నిక్కు చెప్పినట్లు:

"నాయొక్క జీవితకార్యమును నెరవేర్చుటకు కాక నీయొక్క జీవితకార్యమును నెరవేర్చుటకు తగిన శక్తిసామర్థ్యములు నీవు పొందుటకు వీలగునట్లు నిన్ను పెంచెదను."

అని ఎప్పుడు తల్లిదండ్రులు తమ బిడ్డలకు చెప్ప నేర్తురో అప్పుడే దేశమునందు సత్యము స్థాపిత మగును; అప్పుడే దేశమునందు ధైర్యసాహసములు గల స్త్రీ పురుషు లేర్పడి దేశమునకు ఔన్నత్యము సంపాదింతురు.

## 4

వ్యక్తి స్వాతంత్ర్యముయొక్కయు, వ్యక్తిత్వ ప్రకట నముయొక్కయు ఆవశ్యకత నిరూపించుటయే ఇబ్సెను యొక్క సాంఘికవిమర్శనమునందు ముఖ్యమగు విష యము. దేశములయొక్క అభ్యున్నతియు, జాతుల యొక్క విజృంభణమును సంపూర్ణవ్యక్తివికాసము కలి గిన మహాపురుషులమీదనే ఆధారపడియున్న వని

ఇబ్సెనుయొక్క విశ్వాసము. జనసామాన్యముయొక్క మాధ్యముతోను, జనబాహుళ్యముయొక్క దార్జన్యముతోను తన జీవనవిధానముమూలమునను, సారస్వత రూపమునను ఇబ్సెను విరామము లేకుండ పోరాటము సలిపెను. సాంఘికవిమర్శనముతో ఆతని నాటకములు నిండియున్నను, అవి కేవలము సంఘసంస్కర్తలయొక్క పుస్తకములవలె క్షణభంగుర మైనవి కావు. సారస్వత లోకమునందు వానికి శాశ్వతజీవనము కలదు. తన కళాకౌశల్యముకతమునను, వాజ్నిపుణతద్వారమునను, శైలిప్రౌఢిమచేతను, వ్యక్తిత్వగాంభీర్యమువలనను, భావనావైశాల్యముమూలమునను ఇబ్సెను పాశ్చాత్యభావ ప్రపంచమునందు ఒక ఉత్తమస్థానమును పొందియుండెను.

# ఏమియల్

"Amiel was certainly one of the strongest speculative heads who, during the period from 1845 to 1880, have reflected on the nature of things."

RENAN.

ఏమియల్ జీవనచరిత్ర చిత్రమయినది. అద్భుత మేధాశక్తి గలిగియు, విజ్ఞానసంపన్ను డయ్యు, ఆయన ఏ గ్రంథము నైన రచించి కీర్తి గాంచ లేదు. అతికోమలమును, ప్రేమపూరితమునగు హృదయము గలిగి యుండియు, జీవిత మంతయు ఏకాంతమున గడపెను. అంతరాత్మప్రబోధములకు నెక్కువ విలువ నిచ్చినవా డయ్యు, విధిని ఎక్కువగ గౌరవించినవా డయ్యు, ఉత్సాహపూరితు డయ్యు, కార్యశూరత్వమును అభిలషించినవా డయ్యు, అనంతత్వమునందు తన అల్పత్వము చూచి విస్మయము చెంది ఆయన తన జీవితమునం దే కార్యమును నెరవేర్ప పూనుకొనకయే ప్రపంచమును వదలి వెళ్లెను. కాని పాశ్చాత్యభావప్రపంచమును గురించి యోచించు నపుడు స్విట్జర్లాండ్ దేశస్థు డగు ఏమియల్‌ను మరచుటకు వీలు లేదు.

ఆయన జీవించి యున్నప్పుడు ఏ గ్రంథమును రచించి

కాని ఏ కార్యమును నేరవేర్చి కాని పాశ్చాత్యభావాభ్యున్నతికి ఏమాత్రమును తోడ్పడక పోయినను, తన అంతర్జీవన చరిత్రమును తెలుపు "దినచర్య" (journal) ను ఆయన మిత్రుడగు షేరర్ ఏమియల్ మరణానంతరము ప్రకటించినప్పుడు, ఆ గ్రంథము, హంఫ్రీవార్డు దొరసాని చెప్పినట్లు, ఐరోపాయందలి పాఠకుల హృదయములు కదల్చివేసి ఏమియల్‌కు శాశ్వతకీర్తిని సంపాదించినది. ఆహా, భావముయొక్క శక్తి అత్యద్భుతము గదా! ఏ మహాపర్వతము మీదనో, ఏ అంధకారావృత మగు అరణ్యమధ్యముననో, ఉన్న మనుష్యుని హృదయగహ్వరమున ఉదయించినను, భావము అద్భుత తేజస్సుతో వెలుగుచు ప్రపంచమునంతను ప్రకాశమానము గ చేయును! భావోదయ మయినపుడు, అంధకారము వెలుతురుగ మారిపోవును; నిశ్శబ్దతకు గంభీరవాఙ్మిపుణత లభించును. ఏమియల్ గొప్ప మేధావంతుడు; విజ్ఞానసంపన్నుడు; భావవాతావరణమునందే తన జీవితమును గడపిన యోచనాశాలి. అట్టి వాని జీవిత మే విధమున వృథా కాగలదు! ప్రపంచమునందు ఒక అణువైనను నశింపనేర దని భౌతికవిజ్ఞానులు చెప్పుదురు. అట్లయినచో నక్షత్రముల రహస్యము తెలిసికొనగలుగు,

అదృశ్యప్రపంచమును దర్శింపగలుగు భావము నశిం చునా ? భావవాతావరణమునందు జీవించిన మనుష్యుని జీవితము వృథా యగునా ? తన జీవితమును, అసమాన శక్తిసామర్థ్యములను వృథాపుచ్చుచున్నాడని అతని మిత్రులు తలంచినను, ఏమియల్ యొక్క జీవితమును ఆయన బుద్ధికౌశలమును ఏమాత్రమును వృథా కాలే దని ఆయన "దినచర్య" ను పఠించిన వారు నిశ్చయ ముగ చెప్పెదరు.

## 2

ఏమియల్ యొక్క "దినచర్య" మిక్కిలి రమ్యమగు గ్రంథము. సామాన్యముగ మనుష్యులు ప్రకటించుటకు గ్రంథముల వ్రాయునప్పుడు, అవి వారియొక్క యథార్థ భావములను మాత్రమే ప్రకటించు ననుకొనుటకు వీలు లేదు. మనుష్యులచే యథార్థములుగ ప్రకటింప బడు భావములను, స్వజాతికి ప్రీతికరములగు భావము లను, పుణ్యపురుషులలో చెల్లుబడి చెందుచున్న భావము లను గ్రంథకర్తలు కీర్తి నపేక్షించి, బుద్ధిపూర్వకముగనో, లేక కేవలము ఆచారము ననుసరించియో, లేక

ఒక్కొక్కప్పుడు వారికి తెలియకుండగనే వారి గ్రంథము లందు వెలిపుచ్చుచుందురు. కాని ఏమియల్ యొక్క "దినచర్య" ప్రకటించుటకు వ్రాసిన గ్రంథము కాక పోవుటవలనను, తాను చేసినటువంటి కార్యములు, తన యందుదయించిన భావములు, తనయొక్క కష్టసుఖములు, లోపాలోపములు త్రికరణశుద్ధిగ ఆయన వ్రాసికొనుటవలనను ఆ గ్రంథమున కొక వింతవిలువ కలదు.

"దినచర్య" భావగర్భిత మగుటయే కాక, మానవ స్వభావమును చక్కగ విశదీకరించును. ఆధునికపాశ్చాత్యులలో అత్యుత్తమపురుషుల కలవరపరచు ఆశయములు, ఆదర్శములు ఈ గ్రంథమును చదివిన తెలిసికొన వచ్చును. సారస్వతము, కళలు, భౌతికవిజ్ఞానము, తత్త్వశాస్త్రము మొదలగునవి అన్నియు ఏమియల్‌ను ఆకర్షించినవి. కాని అతని భౌతికవిజ్ఞానాభిమానము ఆత్మజ్ఞానాభిలాషను నశింపజేయలేదు. అతని శాస్త్రపఠనము మతాచరణమును భంగపరుపలేదు. ఏమియల్ స్పష్టమగు దృష్టి కలిగినవాడు. కంటికి కనిపించు జడపదార్థములు చూచి తృప్తి చెంది విశ్వమందు జడపదార్థములు తప్ప మరేమియు లేదని చెప్పు భౌతికవిజ్ఞానుల వలె హ్రస్వద్రష్ట కాడు. ఆత్మయందు విశ్వాసము కలిగి

ఆత్మసంబంధమగు విషయములగురించి ఆయన విశేష ముగ యోచించువాడు. యథార్థముగ యోచించు ప్రతిపురుషుడు చెప్పునట్లే, ఏమియల్ కూడ మతము యథార్థ మనియు, విధి యథార్థమనియు, ఈ రెండే మనము ముఖ్యముగ గమనింపవలసిన విషయములనియు నొక్కి చెప్పెను.

శరీరముయొక్క ప్రతి అవయవమును, మనసుయొక్క ప్రతిశక్తియును ఈశ్వరుని సమీపించుటకు ఏర్పరుపబడిన మార్గములే యనియు, ఈశ్వరుని పొందుట ఒక్కటియే అవసరమగు కార్య మనియు ఆయన నుడివెను. ఈశ్వర సామీప్యమును అనుభవించుటే మత మని ఆయన భావించెను. ఏవో కొన్ని ఆచారముల ననుసరించి నంత మాత్రమున, ఏ మత సంఘములోనో సభ్యు డయి నంత మాత్రమున, ఏ దేవాలయమునకో, ఏ చర్చికో వార మున కొక పర్యాయము వెళ్లి నంతమాత్రమున, మతము కల దని యూహించుట కేవలము పొరపాటు. "ఈశ్వ రునిలో నివసించుట, ఈశ్వరుని కార్యము నెరవేర్చుట— ఇదియే మతము, ముక్తి, శాశ్వతజీవనము." అని ఏమియల్ వ్రాసెను. రక్షించునది యేది ? నీతిప్రవర్తన. కాని నీతిప్రవర్తన అన నేమి ? దొంగిలింప కుండుటయా?

అబద్ధము లాడ కుండుటయా? అంతమాత్రమే కాదు. ప్రపంచమందు ఈశ్వరు డొసంగిన పదవిని సంతోష పూర్వకముగా స్వీకరించి, ఆయన ఆజ్ఞయే మనయిచ్ఛగా గైకొని, ఆయనకు ఇష్టము లేనివి బుద్ధిపూర్వకముగా త్యజించి ఆయన సేవకులయి జీవించుటే నీతిప్రవర్తన మని ఏమియల్ చెప్పెను. పరాక్రమము లేనిదే యథార్థపవిత్రత లేదు (There is no serious piety without heroism). సంపూర్ణజీవనమునకు విజ్ఞానము, ప్రేమ, శక్తి అత్యవసరము. శక్తి లేకపోవుట, స్వేచ్ఛ లేకపోవుట, ఆశ లేకపోవుట—అదియే నరకమని ఆయన చెప్పెను. శాశ్వతజీవన మన భవిష్యజ్జీవనము కాదు; సృష్టి శాసనమున కనుగుణముగ జీవించుటయే, ఈశ్వరునియందు జీవించుటే శాశ్వతజీవనము. శాశ్వతజీవనము నిరంతరమగుపోరాటముచే సంపాదింపవలయును. గట్టి నమ్మకములు కలిగి అత్యుత్తమ ఆదర్శములు కలిగి వాని ననుసరించి జీవించుటకు తగిన పోరాటము సలుపక సంఘప్రవాహమునంబడి కొట్టుకొనిపోవు మనుష్యుడు ప్రపంచమందలి వస్తుసామగ్రిలో ఒక వస్తువే యనియు (a mere article of the world's furniture), కదలుచున్నటువంటియు జీవించుచున్నటువంటియు

మానవుడు కాక కదలింపబడు ఒక వస్తువనియు, ఏమియల్ గంభీరముగ చెప్పెను. మనుష్యుడు నిరంతరాభివృద్ధి పొందవలసిన వాడు; ఎప్పుడు వాడు పెరుగుట మానునో అప్పుడే క్షీణించుటకు మొదలుపెట్టును. అదియే మృత్యువునకు ప్రారంభము. ఎడతెగని విజయము పొందుచే జీవించుట. కావున సంపూర్ణజీవనమునకు, యథార్థజీవనమునకు శక్తి అవసరము. కేవలము శరీరబలము కాక ఆత్మశక్తి అవసరము.

ఈ ఆత్మశక్తి ఎట్లు వచ్చును? ముఖ్యముగ విశ్వాసము ఉండవలెను. అవిశ్వాసము మృత్యువు. అపనమ్మకము ఇచ్ఛాశక్తిని నాశముచేయును; సర్వశక్తులను అడుగంట చేయును; ఈశ్వరుని మరపింప చేయును; ప్రార్థనను విధిని తృణీకరింపచేయును. మృత్యుహేతువగు అవిశ్వాసమును పారద్రోలి విశ్వాసమును సంపాదింపవలయును. విశ్వాసమే మనకు బలమిచ్చును; విశ్వాసమే ఆత్మశక్తిని ప్రసాదించును; విశ్వాసమే మనలను అజేయులుగ చేయును. విశ్వాసము ఉండిననే కాని, కష్టముల ననుభవింపలేము; దుఃఖముల సహింపజాలము. విశ్వాసము ఉండిననే కాని, దుఃఖము ప్రేమసింధు వగు నీశ్వరుడు మన యాత్మపారిశుద్ధ్యము

కొరకు పంపిన ఔషధ మని గుర్తింప లేము. దుఃఖము యథార్థముగ ఒక ఆశీర్వాదము. దుఃఖమును అనుభవించిననే కాని, పవిత్రత పొంద నేరము. ధగధగ మండు అగ్నిహోత్రముమీద నడచిననేకాని, ముక్తి లేదు. జీవన్ముక్తులము కా గోరితిమేని, అహంకారమును వధింప వలయును; మనలోని జంతువును సంహారము గావింప వలయును; మృత్యువును నిర్లక్ష్యము చేయవలయును; ప్రేమోన్మాదులము కావలయును. కంటకకిరీటమును ధరించిననే కాని, ఈశ్వరభక్తు లనిపించుకొనుటకు అర్హత పొందము. "A crown of thorns is the sad eternal symbol of the life of saints" అని ఏమియల్ చెప్పెను. దుఃఖము అనుభవింపక, త్యాగము చేయక, మనము ఈశ్వరరాజ్యమందు ప్రవేశింపలేము. గంభీరమగు విశ్వాస ముండిననే కాని, దుఃఖము సంతోష పూర్వకముగ అనుభవించుటకు గాని, ధర్మముకొరకు సర్వపరిత్యాగము చేయుటకు గాని శక్తిని పొంద జాలము.

ప్రతిమనుష్యుని హృదయమునందును ఒక భయంకరమగు నరకము కల దనియు, ఆనరకముయొక్క గాఢాంధకారము మన కన్నుల కప్పివేసి మనలను అధో

గతి పాలు చేయుటకు ప్రయత్నము చేయుచున్న దనియు, ఆ యంధకారమునందు మనకు వెలుతురు నిచ్చు దివ్వె అంతరాత్మయే యనియు, అంతరాత్మప్రబోధముల గమనించి అంతరాత్మ చూపు వెలుతురు ననుసరించి మన జీవితమును గడుపుకొన వలయు ననియు ఏమియల్ బోధించెను.

"Our only talisman lies in that concentration of moral force which we call conscience, that small inextinguishable flame of which the light is duty and the warmth love. This little flame should be the star of our life; it alone can guide our trembling ark across the tumult of the great waters; it alone can enable us to escape the temptations of the sea, the storms and the monsters which are the offspring of night and the deluge. Faith in God, in a holy, merciful, fatherly God, is the Divine ray which kindles this flame."

ఏమి సంభవించినను సరే, అంతరాత్మప్రబోధముల ననుసరించి మన విధిని నెరవేర్చుటయే మన పని యని ఏమియల్ స్పష్టముగ చెప్పెను. సాధారణముగ మనుష్యులను పరిపాలించునది వారికి సత్యమునం దుండు భయ

మనియు, నీతిప్రవర్తనయందు చూపబడు ఉపేక్షయే విద్యార్థికుల బాధించు వ్యాధియనియు, చాలమంది విద్యార్థికులు నాగరికత జెందిన చిలుక లనియు (civilised parrots), ఆయన గ్రహించెను. సైతాను కును మనుష్యునికిని గల భేదము జ్ఞానమునందు కాక నీతియందు కలదు. కావున యథార్థనాగరికత నీతిమీాద, మతముమీాద నిర్మింపబడ వలయును. విధియే సర్వమును నిలువబెట్టున దని (Duty is what upholds all) ఆయన చెప్పెను. మన విధి నెరవేర్చుటే మన పని. తక్కినది ఈశ్వరునిది. దుఃఖము మంచిదే. సుఖమును మంచిదే. ఈశ్వరుని యిచ్ఛకు అనుగుణముగ నడచు కొనుటే మన విధి. ఏమియల్ తన సందేశ మంతయు ఒక్క వాక్యమునందు ఇమిడ్చెను: "Let us be true; this is the highest maxim of art and life, the secret of eloquence and of virtue, and of all moral authority." మనము నిష్కపటముగ నుందుము గాక—ఇదియె కళలయొక్కయు, జీవితముల యొక్కయు ముఖ్యసూత్రము ; వచోనిపుణతయొక్కయు, నీతియొక్కయు రహస్యము.

సంపూర్ణము.



# ప్రాక్ప్రతీచీగ్రంథాలయము

రాజమహేంద్రవరము

ఈ గ్రంథాలయ పక్షమున వెలువడు ప్రచురములు :

## 1. ప్రాక్ప్రతీచీ గ్రంథమాల

ఇందు, సర్వజనసామరస్యమునకు తోడ్పడు ప్రాచ్య పాశ్చాత్య
దేశముల యుత్తమజ్ఞానము ఆంధ్రులలో వ్యాప్తము
చేయుటకు ఆంధ్రగ్రంథములు
ప్రచురింపబడును.

## 2. తదితర గ్రంథములు

గ్రంథమాలలో చేరని యితర విధములయిన గ్రంథములు
కూడ వెలువడు చుండును.

సంపాదకుడు

కామరాజు హనుమంతరావు

# ప్రాక్ప్రతీచీగ్రంథమాల

## నియమములు

1. గ్రంథమాలలో వెలువడు అట్టబెండింగు, రేపరుగలిగి అందమైన గ్రంథము వెల ఒక రూపాయి నాలుగు అణాలు. ఇది చందాదారులకు మాత్రము ఒక రూపాయికే యియ్యబడును.

2. అట్టి గ్రంథములు సంవత్సరమునకు నాలుగింటికన్న నెక్కువ ప్రకటింపబడవు. వీనిని చందాదారులు విధిగా కొనవలెను.

3. గ్రంథాలయములో ప్రచురింపబడు తదితర గ్రంథములు కొని తీరవలయు నను బాధ్యత చందాదారులకు లేదు. కాని వారు కొనదలచిన, అవియు 20% తగ్గింపబడిన ధరలకు బడయవచ్చును.

4. పుస్తకము వెలువడునప్పుడు దాని విలువ మాత్రము చందాదారులు చెల్లింపవలెను; కాని తత్పూర్వము పుస్తకముల వెల నిమిత్తమేమయిన నీయవలె నను నిర్ణయము లేదు. ప్రవేశరుసుము నాలుగు అణాలు దరఖాస్తుతో గాని మొదట పుచ్చుకొను పుస్తకముల వెలతో గాని చందాదారులు చెల్లింపవలెను. పోస్టు ఖర్చులు మొదలయినవి వారె భరింపవలెను.

5. గ్రంథమాలలోని గ్రంథములు గైకొనుచు ధనసాహాయ్యము చేయ నుద్దేశించు అభిమానులలో పుస్తకమునకు రెండు రూపాయలు తక్కువ గాకుండ నిచ్చెడు వారు పోషకులుగ నెంచబడుదురు. రాజపోషకులు తమ యిచ్ఛానుసారము సాహాయ్యము చేయవచ్చును.

# ప్రాక్ప్రతీచీ గ్రంథాలయ ప్రచురములు

గ్రంథమాలలోనివి :—

1. పాశ్చాత్యభావప్రపంచము.

కర్త: ఎమ్. వి. ఎన్. సుబ్బారావు ఎమ్. ఏ. గారు.

అట్ట బైండింగు ప్రతి రు. 1—4—0
కాగితము ,, ,, రు. 1—0—0

2. హిందూజీవనపథము.

సర్. డాక్టర్. ఎస్. రాధాకృష్ణన్ ఎమ్. ఏ. గారు రచించిన The Hindu View of Life అను గ్రంథమునకు కామరాజు హనుమంతరావుగారి అనువాదము.

అట్ట బైండింగు ప్రతి రు. 1—4—0
కాగితము ,, ,, రు. 1—0—0

తదితరములు :—

1. జీవనస్మృతి.

దేశిరాజు పెదబాపయ్యగారి జీవన చరిత్రము.

కర్త: కామరాజు హనుమంతరావుగారు.

వెల ప్రతి 1కి రు. 1—0—0

2. *Shakespeare and the Problem of evil*

Andhra University Extension Lecture by Mr. M. V. N. Subba Rao M. A.

Price per 1 copy Re. 0–8–0

పోస్టుఖర్చులు పై ధరలకు ప్రత్యేకముగ చేర్చబడును. వర్తకులకు కమిషను ఈయబడును. వివరములు వారు గ్రంథాలయమునకు వ్రాసి తెలిసికొనవచ్చును.

# పాశ్చాత్యభావ ప్రపంచము

కర్త: ఆంగ్లభాషాకోవిదులును ప్రస్తుతము ఆంధ్రవిశ్వవిద్యాలయకళాశాలయందు ఆంగ్లభాషాధ్యాపకులు నగు శ్రీ ఎమ్. వి ఎన్. సుబ్బారావు ఎమ్. ఏ. గారు.

పాశ్చాత్యదేశములందు పందొమ్మిదవ శతాబ్దమున నూతనభావతరంగము లెట్లు బయలువెడలి విస్తరించెనో యీ గ్రంథమునందు విస్పష్టముగ సులభశైలిలో వివరింపబడెను.

ఆత్మగౌరవము, వ్యక్తిస్వాతంత్ర్యము, జీవితనిత్యవికాసము ప్రతిపురుషుడును ప్రతిస్త్రీయును లక్ష్యములుగ గ్రహించి, సర్వమానవసమత్వము ప్రపంచమున నెలయుటను, సేవారూపమగు ఈశ్వరారాధన సలుపవలయుననను మహోన్నతాదర్శమును ఈగ్రంథము పాఠకుల దృష్టిపథమున నిలుపును.

ఏమహనీయుల ద్వారమున ఆ భావపరంపర వ్యక్తమయ్యెనో వారి చరిత్రములు మార్గదర్శకములు. వారి పవిత్రజీవితములు సయితము ఈ గ్రంథమునందు సంక్షిప్తముగ పొందుపరుపబడెను. తద్గ్రంథపఠనము ధర్మవిచారణను పురిగొల్పి నూత్నజీవితాకాంక్షను వర్ధిల్లజేయును.

ఇయ్యది బి. ఏ. పరీక్షకు పఠనీయగ్రంథముగ (B.A. Part II. Detailed Text) ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు నిర్ణయించిరను సంతోషకరవిషయము దాని యాథార్థ్యతకు తార్కాణము.

# హిందూ జీవన పథము

కర్త: ప్రపంచవిఖ్యాత తత్త్వజ్ఞులును ప్రస్తుతము ఆంధ్రవిశ్వవిద్యాలయమున వైసుచాన్సిలరు నగు శ్రీ సర్. డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణన్ ఎమ్. ఏ. గారు.

హిందూధర్మ మెట్టి యుదారాశయములపై ప్రతిష్ఠితమయి భిన్నాభిప్రాయములను వివిధాచారములను సమన్వయపరచుచు సమీకరణము జేసి యథార్థ సమత్వభావము పెంపొందించెనో, అది మేల్కొని తిరిగి ప్రస్తుతపరిస్థితులందు ఎటుల కృషిసలుపవలెనో, సుబోధకముగ ఈ గ్రంథమునందు చర్చింపబడెను. అనువాదమును గూర్చి తద్గ్రంథకర్తలగు శ్రీరాధాకృష్ణన్‌గా రిట్లు అభిప్రాయ మొసంగిరి.

"నేను రచించిన "Hindu view of life" అను గ్రంథమునకు కొమరాజు హనుమంతరావుగారు ఆంధ్రమునందు జేసిన భాషాంతరీకరణమును నేను సొంతముగ జదివితిని. హనుమంతరావుగారు కడు జాగరూకతతో తద్గ్రంథమును భాషాంతరీకరించిరని యిట్టికార్యమందలి కష్ట మెరిగినవా రెల్ల రంగీకరింతురని నమ్ముచున్నాను. మాతృకయందలి భావములను సరిగ ననువదించుటకు వారతిశ్రద్ధతో కృషిసలిపిరని పుస్తకమునం దంతటను కానవగును. ఆంధ్రపాఠకలోకము వారి యనువాదగ్రంథము నాదరింతురని యాశించుచున్నాను."

## కొన్ని యితరాభిప్రాయములు.

కృష్ణాపత్రిక: "జగద్విఖ్యాత తత్త్వశాస్త్రవేత్తలగు రాధాకృష్ణన్‌గారి ఉపన్యాసములు నిట ప్రస్తుతించుట అనవసరము. అనువాదము కూడ సరళముగ నున్నది."

ధర్మసాధని: "ఇట్టి యుత్కృష్టగ్రంథమును ఆంధ్రములోనికి భాషాంతరీకరించి ఆంధ్రవాఙ్మయమునకు వన్నె తెచ్చిన కొమరాజు హనుమంతరావుగారి కృషి ప్రశంసాపాత్ర మైనది."

# జీవనస్మృతి.

## కర్త: శ్రీ కామరాజు హనుమంతరావుగారు.

సంపాదకులు, ప్రాక్ప్రతీచీగ్రంథమాల.

ఆంధ్రపత్రిక:— "వీరు (బాపయ్యగారు) నడివయసులో అసువులు బాసినను, సంతతకార్యదీక్షచే మహత్తరకార్యములను జేయగలిగిరి. అట్టి ఆంధ్రప్రముఖుని చరిత్రను సులభశైలిలో వ్రాసి, జీవితపు వివరములను చక్కగ తేటపరచి, గ్రంథకర్త ఆంధ్రప్రపంచమునకు మహోపకార మొనర్చెను."

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు:— "హనుమంతరావుగారు బాపయ్యగారివంటి సత్పురుషుని జీవితము వ్రాసి యాంధ్రదేశమునకు నుపకారము జేసిరనుట నిర్వివాదాంశము."

**The Journal** "*Triveni*":– "The art of biography-writing is yet in its infancy amongst Andhras, but we trust that this splendid book will stimulate similar efforts. We wish to add that every Andhra ought to read the book and commune with the lofty spirit of Bapayya."

**Sir. Dr. S. Radhakrishnan Esq:**– The author has a very intimate knowledge of his subject and is also his devoted admirer. The book, therefore, shows insight and sympathy and deserves to be read by the forward-looking minds of the Andhradesa."

**Mr. Tekumalla Rajagopala Rao B. A.**:– "As I read over the book, I felt his living presence before me, and you (the author) have done great service to the Andhra world by its publication—so long delayed."

**Mr. D. Subrahmanya Sarma M. A.**:– "You (the author) have very well brought out the prominent features of the character of my friend."

ఇంటర్మీడియేటు పరీక్షకు పఠనీయ గ్రంథముగ (Non-detailed Text) నిర్ణయించి ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు ఈ గ్రంథ ప్రాశస్త్య మంగీకరించి యున్నారు.

## Shakespeare and the problem of Evil.

M. V. N. SUBBA RAU M. A.

**Triveni :** "Mr. Subba Rau writes with much persuasive sweetness on many aspects of the problem. .........Mr. Subba Rau does not try to distil a system of philosophy, but writes about the working of evil, the old theory of waste, the tyranny of Chance, the symbolism of the *Tempest* and its significance as the testament of Shakespeare........He has succeeded in producing a readable book on a worn-out theme."

**Hindu:** ".........does credit not only to his obvious enthusiasm for the subject but to his wide reading. The problem of evil has always had a fascination for the philosophic mind and Mr. Subba Rau here shows us how the world's greatest dramatist has solved it."

**Sunday News:** "Mr. Subba Rau's book will be very useful to students who are expected to possess a comprehensive knowledge of shakespearean Drama. He has approached the task in the spirit of an admiring critic and with the natural leanings of a Shakespearean Scholar he has justified shakespeare's seeming inconsistencies in his observations on life and human conduct.........Yet our author has brought to bear upon his subject a discriminate judgment, sound criticism and a balanced admiration. In his usual facile style he has placed before the reader on the problem of evil a veritable *multum in parvo*. The author's generalisations themselves are born of ripe experience which is visible throughout the lecture."

**Professor V. K. Ayappan Pillai (Presidency College Madras.)** "...........Your excellent essay on 'Shakespeare and the problem of Evil'. It is well written and deserves to be widely known."

